# DEVIBHAGAVATAM.

## Skandha 3.

BY

TIRUPATI VENKATESWARA KAVULU,

*SATAVADHANEES, &c. &c. &c.*

FIRST EDITION.
1,000 COPIES.

PRINTED AT

SREE BHYRAVA PRESS,

MASULIPATAM.

*Price 12 Annas*

1910.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

—— :×: ——

# దేవీభాగవతము.

## తృతీయస్కంధము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి



శ్రీ భైరవముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

మొదటికూర్పు 1,000 కాపీలు

మాచిలీబందరు.



దీనివెల రు 0-12-0.

1910.

# విషయసూచిక.



| పేజీ. | విషయము. | పేజీ. | విషయము. |
|---|---|---|---|

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ దేవీ భాగవతము.

తిరుపతి వేంకటీయము.

## తృతీయస్కంధము.



క. శ్రీకరకడిమొద్దశుభా
ఖ్యాకగ్రామాభిజనన! హారనీహార
శ్రీకలితదివ్యకీర్తి
ప్రాకటగుణ చక్రవర్తి! బ్రహ్మయశాస్త్రీ. 1

వ. అవధరింపు మక్కథకుండు మునుల కిట్లను నట్లు భాగవత కథనాభిముఖుం డగుసాత్యవతేయునకు జనమేజయుం డిట్లనియె. 2

గీ. వ్యాస! సత్యవతీసుత! భగవతీమ, ఖం బనుచుఁ జెప్పితివి తద్భగవతి యెట్టి, దో? యెవరో? యెట్టిగుణములతో నెసంగు, నో? తదీయమ ఖం బెట్టిదో? వచింపు. 3

వ. బ్రహ్మాండోత్పత్తియు బ్రహ్మవిష్ణుమహేశ్వరులస్వాతంత్ర్యా స్వాతంత్ర్యములును సురాసురలకాలవశగత్వావశగత్వమ్ములును వారల యుత్పత్తులును వారలశరీరవిచారమ్మును సవిస్తరమ్ముగా నానతిమ్ము నావుడు సాత్యవతేయుం డిట్లనియె. 4

గీ. కఠిన మగుప్రశ్న యొనరింపఁ గడఁగితీవు, దీని కుత్తరమును సావ ధానముగ వచించెదను మున్ను నారదుచెంత కరిగి, యడిగితిని గంగయొద్దున సమ్మహాత్ము. 5

క. ఈసకలబ్రహ్మాండము, చేసినవాఁడెవఁడు? తెలియఁ జేయు మసత్యం బో? సత్యమొ? బహుకర్తృక, మో? సకలమ్మునకుఁ గర్త యొకఁడో మహాత్మా. 6

వ॥ కొందఱు శంకరుండనియుఁ గొందఱు నారాయణుండనియు విరించియనియు సూర్యుండనియు వాసవుండనియు వరుణుండనియు యముండనియుఁ గుబేరుండనియుఁ బావకుండనియుఁ బవనుండనియు సోముండనియు గణేశ్వరుండనియు ననేకు లనేకప్రకారమ్ముల జగత్కారణంబు వచియించుచుందురు, మఱికొందఱు వారాహియు నారసింహియు మహాలక్ష్మియు శాంకరియు బ్రాహ్మియు వాసవియు వారుణియు నా ననేకనామంబులు గలయదియు సనాతనియు ననాదినిధనయు సర్వవ్యాపినియుఁ బురుషానుగతయు నాదిమాయయుఁ ద్రిగుణాతీతరూపయు గుణవిస్తారకారిణియు నిర్గుణయు సగుణయు నగుపరదేవతయ సకలకారణంబని చెప్పుదురు, మఱికొందఱు నిరంజనమ్మును నిరాకారంబును నిర్లేపమ్మును నిర్గుణంబును నగు తేజం బని చెప్పుదురు, మఱికొందఱు వేదోపనిషత్ప్రతిపాదితుం డగు తేజోమయుం డని యందురు, కొందఱు సహస్రనయనుండును సహస్రశీర్షుండును సహస్రకరకర్ణుండును సహస్రపదుండును నగుపురుషోత్తముం డని యుఁ గొందఱు విరజంబును విరాజంబును శాంతంబు నగునాకాశం బనియందురు, మఱికొంద ఱనిశ్చితబ్రహ్మవాదులును గొందఱనీశ్వరవాదులును గొందఱు స్వభావవాదులును గొందఱు ప్రకృతికర్తృత్వవాదులును నై యుంటం జేసి సందిగ్ధం బగు నిమ్మహావిషయమ్మున మనంబు డోలాయమానం బగుచున్నయది ధర్మాధర్మంబులు నిర్ణయింప నశక్యమ్ములు, ధర్మవంతులును సత్త్వగుణోత్పన్నులు నగు దేవతలు పాపాత్ము లగురక్కసులచేఁ బీడింపఁబడుటయు ధర్మాత్ములును సదాచారులును నగుపాండవులు కష్టములపాలగుటయుఁ గనుంగొన ధర్మమ్మునకు వ్యవస్థ గానరాకున్నయది నాసంశయచ్ఛేదం బొనరింపు మనవుడు. ౭

క॥ నారదుఁడు వచించిన తెఱఁగారసి వివరింతు నీకు ననఘా! చేతోధీరత నాకర్ణింపుము, పారంగతుఁ డై నయట్టి పండితుఁ డున్నే. ౮

క॥ నారదుఁడు శంక మదిఁ జె, న్నారఁగ నొకనాఁడు నీరజాసను నడుగఁ, గారాబ మెసఁగ నతఁడు గు, మారునకుం జెప్పినట్టి మార్గము వినుమా. ౯

వ॥ కుమారా! భవదీయప్రశ్నంబు దుర్బోధం బయ్యది వివరింప నస్మదాదులకే కాక విష్ణువునకుఁ గూడ నసాధ్యం బైనను నాయెఱింగి నంతవట్టు వివరించెద విను మని యిట్లనియె.　　　　౧౦

గీ॥ మున్ను సకలంబు సంద్రమైయున్నతఱిని, భూతములు పుట్టె నేను గంజాతమందుఁ, బొడమితిని బొడమియు నలుగడలు చూడ, నర్ణవముదక్క వేఱొక్కఁ డరయరాదు.　　　　౧౧

క॥ ననుఁ బుట్టించినఘనుఁ డే, యనఘుఁడొ! యిప్పంకజమున కాధారం బే, మని నిశ్చయింతు నీజల, ము నిలుచుకత మేమొ! యనుచు మోహమయుఁడనై.　　　　౧౨

గీ॥ పుడమిపై నీరు నిల్చుట పొసఁగు నట్టి, పుడమి నల్గడలను జూడఁ బడ దటంచు, వనధి నీఁదుచు నొకవేయివత్సరములు, వెదకుచున్నంత నాకాశవీధియందు.　　　　౧౩

గీ॥ "తప తప"యటంచు నొకమాట దరలుటయును, వేయిసంవత్సరమ్ము లత్యాయతముగఁ, దపము సల్పితి నొం డేమి దలఁపకుండ, జలగతం బగునలజపేజాతమందు.　　　　౧౪

వ॥ పిదప "సృజ"యను నొకపలుకంబరముననుండి వెడలె దానిని విని "యేనేమిసృజింతు?"ననియాలోచించుచున్నంత మధుకైటభు లను రక్కసులు యుద్ధసన్నద్ధులై నన్నుఁ భయపెట్టుచుఁ బద్మనాళం బవలంబించి తజ్జలమ్మున మునంగి.　　　　౧౫

సీ॥ కార్ముకమ్ముల నేలఁ గలడాలు గలవాని బంగారువల్వ మైఁ బరఁగువాని, నెల్లలోకము లేలు నసకంబు గలవానిఁ జల్లచూపులు వెదఁ జల్లువాని, పాపరాపాన్పుపైఁ బవ్వళించినవాని వనమాల గళమునఁ దనరువాని, యోగనిద్రామహాభోగంబు గలవానిఁ జలన మింతయు లేక యులరువాని; గీ॥ శంఖచక్రగదాముఖసాధనములఁ, దవిలి చెలువారునాల్గుబాహువులవాని, నద్భుతమ్మున కాస్పదం బైనవానిఁ, గంటి నొకదివ్యపురుషుఁ గఱవు దీఱ.　　　　౧౬

వ॥ కని యోగనిద్రాస్వరూపిణి యగునద్దేవిని వినుతించిన నా మెయు నతనిశరీరంబు విడిచి దివ్యవిగ్రహయై నభమ్మున నిలిచె నంత

నతండును మేల్కాంచి సన్నద్ధు లగురక్కసులఁ దనయూరుభాగమ్మున వధించునంతలో రుద్రుండును నట కేగుదెంచుడు నేము ముగురము నప్పరదేవతం బ్రార్థించుటయు నాపె దయాంతరంగయై యి ట్లనియె.

గీ॥ హరిహరబ్రహ్మలార! మీయంత మీవి, ధులను నెఱవేర్చి కొనుఁడు
పదుండు మీకుఁ, దగునివాసమ్ములను జెందఁదగు నశేష,జగము సృ
ష్టింపనగు నాల్గు తెగలు గాఁగ. ౧౮

గీ॥ అనెడిజగదంబపలుకుల నాలకించి, యిట్టు లంటిమి సందియం బినుమ
డింప, భూమి లే దయ్యె జలము ప్రభూత మయ్యె, నంబ! యేగతి
సృజియింప నగునో? చెప్పుము. ౧౯

గీ॥ భూతములు గుణతన్మాత్రములును నింద్రి, యమ్ములును సలవడినఁ
జేయంగ నగును, గాని యూరక సృష్టింపఁగాఁ దరంబె?, యనుచు
జగదంబ చిఱునగ వినుమడించె. ౨౦

ఆ॥ వె॥ అంత నరుగుదెంచె నటకు విమానంబు, గగనతలమునుండి కడు
రయమున, నంబ చిత్రమొకటి యగుపడఁ జేసెద, దీని నెక్కుఁ
డనుచుఁ దెలుపుటయును. ౨౧

వ॥ ఏము నాపెయానతిం జేసి నవరత్నమండితంబును ముక్తాదామభూషితంబును గింకిణీసంకులితంబు నగువిమానం బధిష్ఠించిన నంబిక యద్దాని మనోవేగంబున నడువం జేసె నంత నయ్యది జలధిభిన్నంబై మనోజ్ఞంబైన కొండొకప్రదేశమ్మునకుం జనియె నచ్చట, ౨౨

బ్రహ్మాది దేవతలు భువనేశ్వరిం గాంచుట

సీ॥ కోకిలాకాకలీవ్యాకులీకృతఫలత్ఫలవినమ్రోద్యానపాదపములు
సుందరీసుందరానందబంధురమందిరప్రాంతదీప్రసరఃప్రతతులు
ప్రాకారశోభిదివ్యాకారమణిమండితాకాశతలచుంబిహర్మ్యతతులు
సంగీతభంగీమృదంగరంగద్రింగకోటిభాసురవేశవాటికలును;

గీ॥ యజ్ఞశాలలు మఱియు దేవాలయములు, గలుగుపురవరమును
దానికెలన వనము, నందు వేఁటాడునొక రాజనందనుఁడును, గా
నఁగా వచ్చెఁ గన్నులకఱవు దీఱ. ౨౩

వ॥ మాంమనంబున నయ్యది స్వర్గంబను ప్రత్యభిజ్ఞ యుదయించె బదఁపడియియ్యది యెవరిచేనిట్లు నిర్మితంబయ్యెనని యెంచునాలో విమానంబు మఱియొక్కెడ కరుగుడు. ౨౪

క॥ నందన మనువనమును దా, నంద నగుకల్పకముకడఁ గనందగునందం బందిననందినితల్లియు, నందంద చరించునట్టియైరావణముౕ. ౨౫

గీ॥ అచ్చరలఁ గూడి తమ యిచ్చవచ్చినట్లు, సంచరించెడి గంధర్వ సంచయంబు,సురలును పులోమజనుగూడి సౌఖ్యనిందుఁ,డును యమ కుబేరముఖులును గనఁగన్నరి. ౨౬

వ॥ అత్యాశ్చర్యపర్యాకులచిత్తులమై యచ్చోటు విడిచి యరుగుటయు బ్రహ్మలోకంబుగననయ్యె హరకేశవులు సన్నుంజూచి యిచ్చట బ్రహ్మ యొక్కఁడు గన్పట్టు నితండెవ్వఁ డనవుడు నిట్లంటి. ౨౭

క॥ ఆ వేధయు నావేదము, లావిభవములెట్టివియొ మహాత్ములారా! యావంతయు నెఱుఁగను నే,నేవాఁడనో తెలియరాదిఁ కేమనవచ్చున్

వ॥ పిదప విమానంబు మఱి యొక్కెడ కరుగుటయు,

ఉ॥ నారద! యేమి సెప్పుదు గనంబడె నచ్చట వెండికొండ సు శ్రీరుచిరంబుగా నచటఁ జెన్నలరారుమణీనికేతన ద్వారగమునుండి శంభుఁడు సదాగసుతాప్రముఖుండు కృత్తి వా సోరుచిగుండు వెల్వడియె సొంపగురీతిని గోతురంగుఁడై. ౨౯

తే॥ గీ॥ మూర్తులతోడ సంగయు మగ్న మూన,సుండనై యయ్యెడల నేను జూడఁబడితి,"నింతకన్నను జతురుముండేమికల" దంటుంచు విస్మయపడుసంత నదియు మరల. ౩౦

గీ॥ అరిగె నింక నొక్కెడకట సరయునయ్యె, నిందిరా సుందరీ నాథు మందిరంబు, నిరుపమానంబు వైకుంఠ పురవరంబు, దానిఁ గని విస్మయఁబందె దానవారి. ౩౧

క॥ అతసీకుసుమశరీరుఁడు, చతుర్భుజుఁడు శంఖచక్రశార్ఙ్గగదాభూ షితుఁడు రమారమణీసేవి,తుఁడు విరాడ్వాహనుండు విష్ణువగుపడెన్

ఆ॥ వె॥ అతనిఁ జూచి యతులితాశ్చర్యకలితుల, మగుచు నొకరొకళ్ల
నరసి కొనుచు, నున్నయంత నదియు నున్నతవేగంబు,గడలుకొ
నఁగఁ బాలకడలి కరిగె. 53

సీ॥ యాదోవిశేషదీవ్యత్తుంగతరతరంగావళీశీకరాసేవితంబు
నానావిచిత్రచిత్రానూనదివ్యాస్తరణరంగవేదికారాజితంబు
కలితముక్తాదామకలనాభిరామభాసుహితమందరకోటిమండితంబు;
పారిజాతాదివిభ్రాజమానలతాంతదంతురానంతపాదపయుతంబు
తే॥ గీ॥ గంధలోభభ్రమన్మధుకరవిరావ,భరిత మగు దీవియొండు
దృక్పథము నందె, నందు సుమనోహరమును శివాకృతి
యును, నైనపర్యంకమును గంటి మువల నొకఁట. 58

గీ॥ మణిమయం బగుపర్యంకమధ్యమందుఁ, జెలులు చెలువారఁ గొలు
వున్నయలరుఁబోడి, ననుపమానంతదివ్యకళ్యాణరూపఁ, గంటి మా
రూపమును జెప్పఁగాఁ దరంబె. 39

సీ॥ అరుణాంబరమునఁ జెన్నలరారువగలాఁడి మోవి పైనయధరోష్ఠమె
సఁగు బోటి, కావిపూల్ గలమాలికలు ధరించిననాతి రక్తగంధం
బూనురంగులాఁడి, శోణంబు లగునేత్రకోణముల్ గలకొమ్మ యావ
నమధ్యస్థ మైనచాన, తొలకరిమించుతోఁ దులదూఁగునెలనాగ
యర్కబింబస్ఫూర్తి నలరుకలికి; తే॥ యిందిరాకోట్ల నెదురించుమం
దయాన, ప్రతిపదమ్మును దయఁ జిమ్ముపద్మనయన, మందమందస్మితం
బొప్పుసుందరాంగి, యెన్నఁడును జూఁడ బోని దయ్యిందువదన.

క॥ బిసరుహముకుళమ్ములపస,గసిమసఁగెడిగుబ్బదోయిగడలుకొనఁగ సొం
పెసఁగుమణిభూషణము లిం,పెసలార నెసంగె సర్వశృంగారముగన్.

గీ॥ అరసి "హృల్లేఖ భువనేశి" యని జపించు,నమరకన్యక లిరుగడ నమ
రఁగా న, నంగకుసుమాదిదేవీసనాథ యగుచుఁ, దనరె షట్కోణ
యంత్రమధ్యమ్మునందు. 3౮

క॥ వదలక హ్రీంకారజపం,బెడఁ బాదల నెసంగుపక్షిబృందము చుట్టుం
గదియఁగఁ జాపాదిమహా, యుధమ్ములుధరించియెసకమొప్పెడిదానిఁ

చ॥ కనుఁగొని విస్మయం బొదవఁగా «నెవరో» యని సంశయించునం
తన యొకివేయివేయినయనంబులు మోములుఁ జేతులుం దగ౯
గనుపడె నామహామహిమ కన్నది విన్నది గాదు దాని నే
మనియును జెప్ప గిప్పఁ దగదయ్య యొకించుకయేని నారదా.

గీ॥ అచ్చరయుఁ గాదు వేలుపుమచ్చెకంటి, గాదు గంధర్వియును గాదు
గా! యటంచు,సంశయించెడిమముఁ గాంచి సరసిజాక్షుఁ,డిట్లనియెఁ
గొంత విజ్ఞాన మెసక మెసఁగ. ౪౧

ఉ॥ ఈజగదంబయే మనల నెల్ల సృజించినతల్లి, యీమహా
తేజము యల్పబుద్ధులకుఁ దెల్లము కానిది, మాయ యన్న యీ
శ్రీజనయిత్రియే, జగము శేషమునిండిన దీపరాంబయే
తేజుల కెల్లఁ దే జొసఁగు తే జన నీజగ దేక నేత్రియే. ౪౨

గీ॥ ఈమెయే సర్వలోకంబుసృష్టిఁజేసి,పెంచిహరియించునీమెయే వేదగర్భ
యీమెయే సర్వబీజమయియును విశ్వ, నాయికయు నీమెయే సదా
నందమూర్తి. ౪౩

క॥ ఇరుగడలఁ బరిచర్యా,పరతెమెఱయు భూషణములువఱల విభూతుల్
పరఁగెడిఁ గోట్లకొలఁది నా,సరణిం జూడుఁడు విరించిశంకరులారా.

క॥ ఎంతతపము చేసితిమో, యెంతటి ధన్యులమొ కాని యీభగవతి న
త్యంతముఁ గనుఁగొని ముదిత, స్వాంతుల మైనార మిదియు
సామాన్యంబే. ౪౪

చ॥ తపసులు గాంచ లే రతివ ధాన్యులు చూడఁగ లేరు భార్గవి
చపలమృగాక్షి యాది యగుసర్వనిలింపసతుల్ శతాంశమం
దుపమకు రారు తత్సుకృతయోగము నెన్నఁ దరంబె? పూర్వపు
ణ్యపుఁబరిపాక మెట్టిదొ కదా! కన నయ్యెఁ బ్రిపంచమాతృక౯

గీ॥ మున్ను బాటవేరిలు గుడిచెడిచిన్ననాఁడు, నన్నునుయ్యేలలో నుం
చి సన్నమైన, యెలుఁగలరఁ బాటలను బాడి యేడ్వకుండఁ, గాచి
పోచినతల్లి యీకన్నతల్లి. ౪౫

గీ॥ ఇంతసేపు పరీక్షించి యేనరయఁగ, వెనుకఁ గనుగొన్న సంగతి విశ
ద మయ్యె, మాట లిఁక వేయునేల యీమాత మనలఁ గన్నజగ
దంబ లే రీమెఁ గన్నవారు. ౭౮

వ॥ అట్లగుట మన మీపరదేవతాసమీపమ్మునకుఁ బోయి ప్రణుతించిన మనయభీష్టమ్ము లొనంగుఁ గా దని ద్వారికులు వారించిన ద్వారమందె నిలిచి నుతింపం గడంగుడ మనుపల్కులకు సమ్మతించి విమానంబు డిగ్గి తద్ద్వారసమీపమ్మునకుం బోవుడు మమ్ముం గాంచిజగదంబ చిఱునగవొనర్చుటయు మూగురిమును స్త్రీలమై తత్సన్నిధికిం జని నమస్కరించి యన్యోన్యవనితారూపమ్ము లరసికొనుచుఁ గోటిసూర్యప్రతీకాశంబును నానామణిస్థగితంబును నగుతత్పాదపీఠమ్ము నవలోకించుచున్నంత. ౭౯

క॥ కొందఱు రక్తాంబరలును, గొందఱునీలాంబరలును గొనికొని యాపెకఁ, సుందరులు గొల్చుచుండిరి, కొందఱు పీతాంబరలును గొల్లకొలఁదిగఁ. ౮౦

క॥ ఈడును జోడును గలవిరి, బోడులు నానావిచిత్రభూషణములఁ సొంపీడేర నాపె ముందటఁ, బాడుచు గాడుదురు కనులపండువు గాఁగన్

ఉ॥ నారద? యేమిసెప్పుదు విశద గనరానివిచిత్ర మంబికో
దార రుచిప్రసన్ననఖదర్పణమందు నినున్ ననున్ శివున్
నీరజనాభునిన్ ధరణి నీరజమిత్రుని నీరజారినిన్
వారిధిపర్వతాదుల నవారణఁ జూచితి మొక్కపెట్టుగన్ ౮౨

వ॥ మఱియు మజ్జన్మకారణం బగుతన్మ్నియుఁ దన్నాభి యగు నచ్యుతుండును నతని శయ్య యగు ననంతుండును త్రియస్త్రింశత్కోటిదేవతలును మధుకైటభులును తుంబురుఁడును హాహాహూహూప్రముఖగంధర్వులును రంభాదు లగునచ్చరలును కైలాసాదిలోకంబులును మున్నుగాఁ గల యీవబ్రహ్మాండమ్ముం జూచి పరమాశ్చర్యభరితులమై యేము జగజ్జననిగా నామె నిశ్చయించుకొంటిమి. ౮౩

గీ॥ అమృతమయ మగునాద్వీపమందు లోక, జననిఁ గనుఁగొని మో
దాబ్ధి మునుఁగుమాకు, క్షణముగా నొక్క నూఱువత్సరము లరిగెఁ,
దత్సుఖంబును వర్ణింపఁ దరము గాదు. ౧౮

క॥ మము చెలికత్తెల మని యా, ప్రమదామణులెల్లఁ బేర్మి బయలు
పడఁగ శం, క మనములం దుంచక కూ, ర్మిమెయిన్ గౌరవము చేసి
మెలఁగిరి పిదపన్. ౧౯

హరిహరబ్రహ్మలుభువనేశ్వరినినుతించుట

క॥ ఒకనాఁడు భక్తి నాయం, బిక నాలోకైకమాత విశ్వజగత్ప్రా
పకమహిమఁ గాంచి విష్ణువు,ప్రకటగతి నుతించె నిట్లు బద్ధాంజలియై

సీ॥ కామదాయిని! దేవి! కళ్యాణి! ప్రకృతి! విధాత్రి! లోకేశ్వరి! దండ
మమ్మ,సచ్చిదానందాత్మ! సంసారకారిణి!కలుషహారిణి!నమస్కారమమ్మ
పంచకృత్యవిధాత్రి! పర దేవి! యర్ధమాత్రార్థభూతాత్మ! జోహారులమ్మ
హృల్లేఖ! సంసిద్ధి! వృద్ధి! కూటస్థ! నానాస్వరూపాత్మ! వందనములమ్మ;
తే॥ గీ॥ జగము సృష్టించి పురుషుని కగుపడంగఁ, జేసి యానంద
మొనఁగూర్తు శ్రీమహేశి! తల్లి! యిరువదిమూఁడుతత్త్వముల
వెల్లు, దిండ్రిజాలంబు నా మాకు నింపుగూర్ప. ౨౦

గీ॥ స్వప్రభావమ్ముకలిమి విశ్వమ్ముఁ బ్రోతు, వాత్మతేజమ్ముచే జగ మలరఁ
జేయు, దంబ! కల్పాంతకాలమ్మునందుఁ గూడ, నుందు వెవ్వాఁ
డెఱుంగు నీచందమెల్ల. ౨౧

గీ॥ జనని! మధుకైటభాఖ్యరాక్షసులచేత, మడియ కుండఁగ రక్షించి
మాకు లోక, మెల్లఁ గనుపడఁ జేసినతల్లివీవ, నీదుదర్శన మదియు
వర్ణింపఁ దరమె. ౨౨

క॥ ఏనును బ్రహ్మయు రుద్రుఁడు, గానంగా లేము నీయఖండమహత్త్వం
బేనరునకు శక్యం బగుఁ,బూని కనుంగొనఁగ నీయపూర్వపుఁజరితల్.

క॥ హరిహరకమలజులను హరి,హరకమలజులకును జూపి తంబరో! నీదౌ
చరితం బెఱుఁగం దరమే, పరమాద్భుతసుప్రభావభావ్యము తల్లీ.

గీ॥ కోరఁగాఁ బోను వేఱొండుకోరికలను,నీదురూపంబు నాహృదినిలుచు టొకటి, నోట భవదీయ నామంబు నుడువు టొకటి, యంబ! యా చింతు ని న్నెపు డరయు టొకటి. ౬౨

గీ॥ వీఁడు నాభృత్యుఁ డనుబుద్ధి వెట్టి నన్నుఁ, బాలనము సేయవలెనమ్మ పరమకృపను, పామరుఁడ నేను వచియించుపలుకులందు, నీమదికి వచ్చినంత మన్నింపుమమ్మ. ౬౩

సీ॥ ఏము సృష్ట్యాదికం బినుమడించుట కల్ల భవదిచ్ఛ మామీఁదఁ బ్రబలకున్న, ధాత్రి సమస్తంబు ధరియించు టది కల్ల యాధారశక్తి ప్రాపందకున్నఁ, గంజాతహితుఁడు ప్రకాశించుటయుఁ గల్ల తావక తేజంబు దవులకున్న, సకలజంతువులును సంచరించుటకల్ల నీశక్తి యొక్కింత నెగడకున్న; గీ॥ బ్రహ్మ మొదలుగ నఖిలప్రపంచములున నిత్యములుగాన నెల్లప్డు నెగడనేర, వఖిలమైనట్టిప్రళయమ్ములందుఁగూడ నిత్య వీ వొక్కతెవె భవానీ! మదంబ! ౬౪

గీ॥ విద్య గలబుధవర్యులవిద్య వీవ, కీర్తి గలపుణ్యమూర్తులకీర్తి వీవ శక్తి గలదివ్యశక్తులశక్తి వీవ, యంబ! పలుమాటలేల గాయత్రి వీవ.

ఉ॥ ఆగమముల్ ద్విజామరహితార్థము చేసినతల్లి వీవ మో
క్షాగమమూల మీవ జగదాదివి నీవ స్వధాస్వరూప మీ
వే గతివీవ సర్వమువహించెడిదానవు నీవ స్వాహ వీ
వాగమవేద్య వీవ జగదంబ!మదంబ!కదంబవాసినీ. ౬౬

తే॥ గీ॥ అబ్ధికిఁ దరంగములయట్టు లాదిపూరు, షాంశములు జీవులగుట లోకాంబ! వారి,బంధనిర్ముక్తి కఖిలప్రపంచసృష్టి, సల్పుదువు స్వార్థ మిందు లేశంబు లేదు. ౬౭

గీ॥ జీవు డెప్పుడు తెలివిని జెందు నపుడ, లేనియట్లొనరింతు వీలీల లెల్ల నాట్య మొనరించి యామీఁద నర్తకుండు, మించుతత్తత్కృతుల విరమించునట్లు. ౬౮

ఉ॥ ఎల్లపుడుర్ భవచ్చరణమే శరణం బని నమ్మినాఁడ నో
తల్లి! దురాప మైనపరితాపము తారస మయ్యెనేని స

న్నుల్లమునందు వేఱొకనిమోజ గణింపక యుద్ధరింపు ము
త్ఫుల్లసరోజలోచనసముల్లసదుచ్ఛదయాసుధార్ఝురీ. ౬౯

క॥ అంబ! భవచ్చరణాబ్జయు, గంబునకున్ మ్రొక్కెదుదు నఖండతరజ్ఞా
నం బొసఁగి కన్నతనుజా,తుం బలె రక్షింపుమీ కుతుక మొప్పారన్.

వ॥ అని నానాప్రకారంబుల నుతించి విరమించుచు హరుం డిట్లని
నుతింపం దొడంగె. ౭౧

గీ॥ త్వత్ప్రభావజుఁడై హరితన రెనేని, బ్రహ్మయునునీదు కార్యమైపరఁగెనేని
నేనుమాత్రము నీకుఁ దాదృశుఁడఁగాక, యన్యుఁ డనె తెల్పుమమ్మ
లోకైకజనని. ౭౨

గీ॥ జనని! భూమ్యాదిభూతపంచకము నీవ,త్వక్షు మొదలగునింద్రియపం
చకంబు, నీవ బుద్ధియుఁ జిత్తంబు నీవ మనము, నీ వహంకార మఖి
లంబు నీవ కావె. ౭౩

గీ॥ హరిహరాదులు జగమున కాదిభూతు, లనుచు నేవారు వచియింతు
రల్లవారు, తెలియ నేరనిమూర్ఖు లోచేవదేవి?, వారు జనియించు
టెల్ల నీవలనఁ గాదె. ౭౪

గీ॥ సవిషయమ్ములు సగుణమ్ము లవని మొదలు,గాఁ గలుఁగుభూతములచే
జగంబు పుట్టు, నది స్ఫుటంబగుటకుభవదంశ మొక్క,యుంచు కేనియు
లేకున్న నెట్లు పొసఁగు. ౭౫

క॥ నీ వజవిష్ణుశివాకృతి, భావమునం జేసి జగము ప్రబలించియు నా
పై వేఱుగ మతిగల్గిన, నావర్జించెదవు నీకు నద్దముకలదే ౭౬

గీ॥ ఏము సృష్ట్యాదుల కొకింతయేని శక్తి, గనుట కూహింపఁగా ముఖ్య
కారణంబు, సకలలోకాంబ! తావకచరణనళిన, రాజమానానసమాన
పరాగగరిమ. ౭౭

క॥ భవదీయదయావైభవ,సువిహితము తమోగుణంబు చొప్పడెనాకున్
శివదాయిని! సత్త్వము కే,శవునకును రజోగుణంబు జలజభవునకున్.

క॥ ధనికు లధనికులు నృపులు త,దనుచరులు మొదలుగ నగుననంతం
బగు భే, దనియతిఁ జొప్పడు జగ మిది, జననిరో! భవదీయమతి
విషమ మగుటఁ గదా. ౭౯

గీ॥ జనని! యెన్నంగ సత్త్వరజస్తమములు, త్వద్గుణములు సృష్ట్యాదినిదా
నములగు; హరిహరవిరించుల మము సృష్ట్యాదులకు ని, మిత్త్రమా
త్రమ్ముగా వినిర్మించి తీవు. ౮౦

ఉ॥ అంబ! విహారసంగతులమై చనుదెంచినమాత్రియంబులో
నంబుజనాభుఁ డీజగమునంతయుఁ జేసినవాఁడో! లేక యీ
యంబుజసూతి చేసె నని యందునో! నే ననుకొందునో! సమ
స్తంబు భవద్విలాసకలితంబు నవం బొకయింత యున్న దే. ౮౧

గీ॥ ఈవ సృజియింతు పాలింతు విచ్చపోడమె,నేని యఖిలమ్మును హరింతు
వెల్లవేళ, స్వపతి యగుపూరుషుని మోదసంగతునిఁగఁ,జేయుదువు
నీవిలాస మజ్ఞేయ మంబ! ౮౨

ఆ॥ వె॥ ఆఁడుజన్మమైన నది యభీష్టమమాకు, నీదుసేవనంబు నెగడెనేని
గాన నెల్లవేళఁ గరుణించి యిటులుంచు, మంబ! పురుషభావ మధిక
మగునె. ౮౩

ఉ॥ తల్లి! భవత్పదద్వయముదక్క మఱొక్కటి నొల్లఁ ద్వత్పదో
త్ఫుల్లసరోజషండమధుపూరము గ్రోలకయున్నచోఁ ద్రుటుల్
కల్లలు గావు కల్పములుగాఁ గనుపట్టు నహర్నిశంబు ని
న్నొల్లక యన్యులం గొలుచుయోగులు నిక్కము దైవవంచితుల్.

క॥ అంబ! వృథామాటల లా,భం బేమి? యనుగ్రహించుభావం బది నీ
కుం బొడమెనేని నీమం,త్రంబు నవాక్షరమునాకు దయసేయఁ దగున్

క॥ అనుశివుఁ గరుణించి జగ, జ్జనని నవాక్షర మఖండసత్త్వము మంత్రం
బును నుచ్చరించె దానిం, గొని ప్రణతిం గొలిపి ముదము గొని
యతఁ డుండెన్. ౮౬

వ॥ అంత నేనును భక్తిపరవశుండనై యిట్లు నుతించితి.

క॥ నిను నిర్వచింప శ్రుతి నే, ర్చనదేని జెప్పకున్నె? శ్రీకరి! స్వాహా
యనుట మఖాదుల నినుఁ, గూర్చినదే సర్వజ్ఞ వీవె త్రిభువనజననీ.

ఉ॥ ఏ నొనరించువాఁడ జగమెల్లను నాకుఁ బరుండు లేఁడు వి
జ్ఞాని ననంగ నేనె యని శాంకరి! శంక యొకింతలేక లో

నానితి ధన్యతాగరిమ మూరక సంసృతిసాగరంబునన్
జ్ఞానవిహీనతన్ బడితిఁ గావఁగదమ్మ కదంబవాసినీ. ౮౮

ఉ॥ ఇంతకుమున్ను ధన్యుఁడను నే ననుకొన్న దసత్యమైన నీ
చెంతకు వచ్చి నీచరణసేవ యొనర్పఁగ గల్గెఁ గాన నా
వంతయుశంకలే దిఁకఁ గృతార్థుఁడ ధన్యుఁడ మాన్యుఁడన్ భవ
ధ్వాంత మడంచి నీదుపదభక్తి ధురీవంబొనరింపు మంబరో! ౮౯

క॥ నీవలనఁ గల్గు నోకరా, జీవమ్మునఁ బొడమితిని విశేషించి భవ
త్సేవకుఁడ నైతినజ్ఞా,నావృతిఁ దొలఁగించి ప్రోవు మఖిలాంబ! దయన్

ఉ॥ నీచరితం బెఱుంగనివినీచులుదక్కఁ బరాత్పరుం డటం
చీచతురాననున్ దలఁప రీశ్వరి! స్వర్గము గోరి జన్నముల్
నోఁచెడి వారు నిట్టికె జనుల్, నను నీవ సృజించి తిట్టియా
లోచన నాకె తోఁచ దిఁక లోకులకున్ గతియేమి? శాంకరీ. ౯౦

క॥ పరతత్త్వంబంచునుని,న్నరయక యోగంబులంచు నన్యాయముగా
బరమేశ్వరి! కొందఱుచెడు,దురు త్వద్భక్తితరులకు దొరకునెముక్తుల్

ఉ॥ ఎందులకంబ! పాట్లుఁబడి యెన్నిటనో కృశియించు టోమహా
నందవిధాత్రి! సారెకు మనంబున "శాంకరి! యీశ్వరీ"! యటం
చుం దగుభక్తి నీజపము చూఱగొనం గలవాఁ డెవండు వాఁ
డందు నొకింతలోన జగదంబ! యిహంబుఁ బరంబు సర్వమున్.

తే॥ గీ॥ కావలెనె? వీఁడు సృష్టికై కమలభవుఁడు, హరియు రక్షింపవలె
నె! లయంబు శివుఁడు,లేనిచో నెఱవేఱదే? లీల లివి స,మస్త
మును జేయఁజాలు దోయంబ! నీవు. ౯౪

చ॥ హరిమధుకైటభాసురుల కందిన నేమగు? నట్టివేళ నీ
కరుణయకా! సముద్ధరణ కారణమయ్యె నతండు నేను శం
కరుఁడు మదుద్భవుండఁట! జగజ్జన నాదులయందు శక్తిన్
బొరయుదుమేని యెవ్వరిఁకఁ బొందనివారు వచింపు మంబరో!

క॥ అందఱికి జన్మకారణ,ముఁదెలియఁగవచ్చు సర్వమోహిని! యది నీ
కుందెలియరాదు వినరా,దెందును నజవనఁగ నగుదు వీవ నిజముగా

ఉ॥ ఏసృజియింతు నీహరి వహించును రుద్రుఁడు సంపు నిక్కమే
కాసున కేనిఁగాని మముఁగార్యవిశారదులం బొనర్తు వం
బా! సకలేశి! నీకళమె మాకు సహాయము గానిచో వృథా
యాసమె కాని మే మొకరవంతయుఁ జేయఁగ లేము శాంకరీ.

వ॥ మఱియు నకర్తయు నగుణుండును ననుపాధియు నకలుం డును నగుపురుషుండు భవదీయం బగువినోదంబు నీక్షించి సంతోషిం చుచుండు నని తద్‌జ్ఞులు సెప్పుదురు. ఈతం డొక్కరుండు దక్క నీకన్న బరుండు లేఁడు. ఇదియనిక్కంబైనచో "నేకమేవాద్వితీయం బ్రహ్మ" యను వేదవాక్యంబునకు మిథ్యాత్వంబు పొసంగుఁగాన నన్ను నుగ్రహించి యీయన్యోన్యవిరోధపరిహారం బొనర్చి యవ్వాక్యంబునకు వాచ్యంబు నీవో! లేక యప్పురుషుండో! విస్పష్టంబొనర్పుము నీవు స్త్రీవో! పురు షుండవో! యెఱింగింప వలయు నుత్పుణ్యయోగమ్మునంజేసి భవదీయ సాన్నిధ్యంబు చేకూరె నని ప్రార్థించునన్నుం గాంచి మృదుమధుర గంభీరసంభాషణంబుల నజ్జగదంబ యిట్లనియె. ౯౦

ఆ॥ వె॥ అతఁడ యేను నేన యాతఁడు భేదం బొ, కింతయేని యుండ
దిరువురకును, బుద్ధిమంతులైన పురుషు లెఱుంగుదు, రెఱుఁగ లేరు
బుద్ధిహీనజనులు. ౯౯

క॥ మాయిరువుర యంతరము, జ్ఞేయంబద్దాని యెఱుకఁ జెందినపురుషుం
డే యోగియు ముక్తుఁడు నన, పాయుండాతనికి లేవు భవబంధంబుల్.

బ్రహ్మాదులకు దేవి తనరూపం బుపదేశించుట

వ॥ మఱియు దీపం బుపాధిభేదంబున ద్వైవిధ్యంబు గాంచునట్లును నాదర్శమ్మునం దోఁచుప్రతిబింబమ్ముపగిదిని వ్యవహారకాలమ్మున ద్వైవి ధ్యంబుకల్పితంబయ్యుఁ బరమార్థావస్థయం "దేకమేవాద్వితీయంబ్రహ్మ" యనువేదవాక్యంబ నిక్కంబదియునుంగాక స్త్రీరూపంబు నాకు సృష్టి కాలమ్మునఁ గల్పితం బైనదికాని కల్పాంతమ్మున స్త్రీపుంనపుంసకభేదం బులు లేక యుండుదు. బుద్ధిశ్రీధృతి కీర్తిస్మృతులును శ్రద్ధామేధాద యాలజ్జాక్షుధాతృష్ణలును కాంతిశాంతిపిపాసలును నిద్రాతంద్రాజర లును విద్యావిద్యాస్పృహావాంఛాశక్త్యశక్తులును వసామజ్జాత్వక్కు

లును ఋతానృతవాక్యలును పరానుధ్యాపశ్యంతులును వివిధమ్ములగు నాదులును నేనకాని వేరొండుకాదు వేయేల సంసారంబందు మద్వ్యుక్తంబగు పదార్థం బొక్కండు లేదు. నానాదేవతలందు గౌరీ (బ్రాహ్మీ వారాహీరాద్రి) వైష్ణవీశివావామనీకౌబేరీనారసింహీవాసవీప్రముఖ నానాశక్తిస్వరూపమ్ములఁ బరాక్రమించుచు సర్వకార్యమ్ము లొనర్చుచుందు. జలమ్ములశైత్యమ్మును వహ్నియం దౌష్ణ్యంబును దివాకరునందు దేజంబును జందురునందు హిమంబును నేన. మచ్ఛక్తియుక్తంబగువస్తువీషచ్చలనంబున కేని సమర్థంబుకాదు. మీరుమువ్వురును మదీయశక్తివిముఖులైనచో రాక్షసాదిహరణంబున కశక్తులకా నిశ్చయింపుము. మఱియుఁ బతితుండును స్ఖలితుండును శాంతుండునుభీతుండునుశత్రువశగతుండును నశక్తుం డనఁబడునుగాని యరుద్రుండనియు నవిష్ణుండనియు వ్యవహరింపఁబడఁడు. శక్తియుక్తుండవగుటంజేసియ యీవుజగంబుసృజియింతువు. విష్ణురుద్రులును సూర్యచంద్రులును నష్టదిక్పాలకులునుశక్తియుక్తులగుటంజేసియ తమతమకార్యంబులు నిర్వహించుచుందురు. భూమియు శేషుండు నాదికూర్మంబును దిగ్గజంబులును శక్తిగలుగుటం బట్టియ భారవాహకంబు లగుచున్నవి. కానిచోఁ బరమాణువహనంబునకును గొఱగావు. ౧౮౧

శా॥ హంసాగ్రేసరవాహ! నీరమును నాఖ్యాశేషమౌ నట్లు ప్ర
ధ్వసంబుంబొనరింతు నయ్యనలు నాల్పంబూనుదుర్ గాలి నా
శంసామాత్రముగా నొనర్తు మది నిచ్ఛామాత్రముంజేసి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావము నొనర్పన్నేర్తు నన్నింటికిన్. ౧౮౨

ఆ॥ వె॥ అంతమాత్రమున సమస్తతత్త్వములును,బోయెన నెడిబుద్ధిఁ బూనరాదు, ఘటకపాలరీతిఁ గాఁ బరమాణువు,లందుఁ బృథివి నిల్చునజసూతి. ౧౮౩

వ॥ మఱియు శాశ్వతంబును క్షణికంబును శూన్యంబును నిత్యానిత్యంబును సకర్తృకంబును నహంకారాగ్రిమంబును మహత్తును నను నీయేడు భేదంబులం జొప్పడు మహత్తత్త్వంబు. దీనికతన నహంకారంబు

పుట్టె నీ విమ్మహత్తత్త్వంబువలన సమస్తభూతంబులును యథాపూర్వం
బగుగతి రచియింపు మని చెప్పి, ౧౦౪

ఉ॥ చారుహాసన్ముఖిన్ విమలఁ జందనగంధి సితాంబరన్ మనో
హారిణి రాజసిన్ సరసిజాసన దివ్య సరస్వతిన్ మహో
దారవిభూషణన్ గొనుము దారను గా నని నా కొసంగె నిం
పారఁగ నొక్కశక్తి ని మహాసుగుణన్ జగదంబ కూర్మితోన్.

క॥ ఒసఁగి యిటులనియె నోయి స, రసిజాసన! యేగు మీసరస్వతితో స
ర్వసుఖముల ననుభవించుచుఁ, బొ సఁగన్ వసియింపు సత్యభువ
నమునందున్. ౧౦౬

వ॥ మద్విభూతియగు నీసరస్వతి నెన్నండు నవమానింపక యథే
ష్టసుఖమ్ము లనుభవించుచు స్వకర్మానుయాతంబులై జీవసహితంబులగు
లింగకోశంబులం గొని చతుర్విధంబుగఁ గాలకర్మస్వభావానుగుణంబుగ
సచరాచరంబగు జగంబు సృజింపుము సత్త్వగుణప్రధానుండగుట విష్ణుం
డునీకెక్కుడు,దుస్సహమ్ములగు విషయమ్ములందు మానవప్రకృతులందును
దదన్యప్రకృతులందునుం బుట్టుచు దానవులం బరిమార్చుచుండు శంక
రుండును నట్లసహాయుం డగుచుండు. ౧౦౭

క॥ దేవతలం జేయుము భూ, దేవాదిద్విజులు మి మ్మధికదక్షిణలన్
భావింపఁదగిన యాగ,శ్రీ వెలయఁగ నెపుడుఁబూజసేయుదు రెలమిన్

వ॥ తత్తద్యాగమ్ములయందు మన్నామోచ్చారణమాత్రమ్మునన్
జేసి మీరును సంతుష్టిఁ జెందుదురుగాక. మీలోఁ దమోగుణ ప్రధా
నుండగు శంకరుండు విశేషించి పూజనీయుండు, దైత్యులవలనిభయంబు
మీకేరికిని దుస్సాధంబగునెడ వారాహీప్రముఖావతారంబుల మదీయ
శక్తు లుత్పత్తినొందుచు సంహరించెడిఁగాక. మంత్రిరాజంబగు నవాక్షర
మంత్రంబు నబీజంబుగా నెల్లప్పుడు జపియించిన నీకుసర్వార్థసిద్ధి కాఁ
గలదు పొమ్మనిచెప్పి హరిం జూచి యిట్లనియె. ౧౦౯

ఉ॥ ఈరమణీలలామఁ గమలేక్షణ నిందిరఁ జందిరానన్
దారనుగా గ్రహించి త్వదుదారభుజాంతరసీమ కేళికా

గారము గా నోసంగు మొక కాలమునందయినన్ విమానితం
గా రచియింపకే మిగుల గారముగాఁ గనఁగాఁ దగుంజుమీ.

క॥ దేవతల జీవికకు నై, యావశ్యకములు సమస్తయాగంబులు భూ
దేవతల కని విధించితి, నావిషయంబున మెలంగుఁడవిరుద్ధగతిన్.

క॥ మీరలు ముగురు మదంశో,దారులగుటఁ జేసి జగము తగ మిము నెం
తే, నారాధించు సమమ్ముగ,నారయ భేదంబు నెవ్వఁడతఁడడుగంటున్

గీ॥ హరిహరబ్రహ్మలకు భేదమరయరాదు, గాని గుణభేదమొక్కింత గల
దు మీకు, సత్త్వము ప్రధానమగు నుపసర్జనంబు, తక్కిన గుణద్వ
యము నీకుఁ దమ్మికంటి. ౧౧౩

క॥ ఈవు రజోగుణ మూనెడి, యావేళలయందు నుపవనాదికమున సు
శ్రీవెలయఁగ నీభార్గవితో, విహరింపుము మదిం గుతుకమలరారన్.

వ॥ వాగ్బీజమాయాబీజకామబీజసంపుటీకృతంబును బరమార్థదం
బు నగునిమ్మహామంత్రంబుగైకొను మని యమ్మనురాజం బుపదేశించి
యిట్లనియె. ౧౧౪

ఉ॥ నా కెపు డిచ్చ పుట్టునో వినాశమొనర్పఁ బ్రపంచ మష్ట, నా
యాకృతియందు మీముగురు నైక్యముఁ జెందెద రట్టివేళ, సౌ
ఖ్యాకరమై జయప్రదమునై తగునీవరమంత్రరాజముం
జేకొని పేర్మిమైఁ బఠనసేయుము పొమ్ము శుభంబు నీకగున్. ౧౧౫

వ॥ వైకుంఠంబు నీకు నివాసంబగుఁ గాకయని శంకరుంజూచి
యిట్లనియె. ౧౧౬

గీ॥ సత్త్వము రజోగుణము నుపసర్జనములు, తమము ముఖ్యము నీకస్మ
దంశజనిత,యగుమహాకాళి యీగౌరి తగుకళత్ర, ముగ వసింపుము
కైలాసభూధరమున. ౧౧౭

ఉ॥ గౌరినిగూడి సంతతసుఖమ్ములు చెంద రజోగుణంబు దే
వారులతోడఁ బోరుల జయంబు గొనంగఁ దమోగుణంబు సం
సారమహార్ణవోత్తరణసాధన మస్మదభిఖ్య యోగమా
ధారము సంస్మరింపఁగ నుదారము సత్త్వగుణంబు నీకగున్. ౧౧౮

గీ॥ ముగురకును మూఁడుగుణములు ముఖ్యములు గు, ణంబులకు వెలి
యగుపదార్థంబు లేదు, అట్టివాఁ డొక్క పరమాత్మ యతఁ డదృశ్యుఁ
డేనుఁ గాలానుగతి గుణ మూనుదాన. ౧౨౦

వ॥ సర్వంబునకుఁ గారణంబకాని యేను గార్యంబుగాను నావలన
సత్త్వరజస్తమోగుణాత్మకం బగుపరాహంతయు దానివలన * మహత్త
త్త్వంబును దానివలన నహంకారంబును దానివలనఁ బంచతన్మాత్రలును
వానివలనఁ బంచభూతమ్ములును యథాక్రమంబుగ నుద్భవించె. భూత
పంచకంబును గర్మేంద్రియపంచకంబును జ్ఞానేంద్రియపంచకంబును
మానంబును నను నీ పదియాఱును కార్యంబులును గారణంబులునై
యొప్పు. మహత్తత్త్వాదిసప్తకంబును నిట్టిదియ. పురుషుండు కార్యకారణో
భయ కోటిప్రవిష్టుండుగాక యుండు నిదియంతయు సంక్షేపమ్ముగా
వివరించితి నీక నీలానాసమ్మ్ములకుం బొందు విషమం బగుకార్యంబు
నటస్థించినచో శబలితుండగుపరమాత్మను స్మరించునది. స్మరణ
మాత్రమ్ముసంజేసి యేను గోచరింపఁగలదాన నని మాయాముగురకుం జెప్పి
పనిచిన నేమును నాస్థానంబు వదలి చనుచెంచు వారము. ౧౨౧

క॥ స్త్రీరూపమొదలి పురుషా, కారము సంప్రాప్తమగుడుఁ గలిగితిమి నా
యాకృతులెంచుచు విమా, నారూఢులమగుచు నేగునాసమయమునన్

చ॥ కనుఁగొన నాసుధాజలధిగాని మహోమహిమానుభావ యా
జననియుఁగాని యాచెలులసంఘముగాని మణిఘృణికన
త్కనకమయంబు ద్వీపమదిగాని మఱొక్కటిగాని లేద యే
మనఁగల! శుద్ధశూన్యముగనయ్యెడ నెయ్యెడఁ దోఁచె నారదా. ౧౨౩

వ॥ పిదప నేమును మును మధుకైటభుల వధించిన చోటికి కే
తెంచి విమానంబు డిగితి మచ్చటన వజ్జన్మపంకజంబునుం బొడసూపె.

బ్రహ్మాండోత్పత్తి

ఆ॥ వె॥ దేవియనఁగ నిట్టిదివ్యస్వరూప మ, హానుభావ యట్టియనఘ
చరితఁ, గన్నులార నేము గాంచితి మనుచు నా, రదుఁడు తండ్రి
కనియె ముదము దనర. ౧౨౪

* ఈమహత్తత్త్వమే బుద్ధియనియుఁ జెప్పఁబడు.

వ॥ తండ్రీ! నీచెప్పిన దేవీమహత్త్వంబు నామనమ్మునకు నచ్చె నికఁ బురుషుండన నెట్టిఁడో! వివరింపు మదిగాక యింతవట్టును సగుణయగు శక్తి ప్రభావం బెఱింగించితి వింక నిర్గుణశక్తిప్రభావంబు వినఁగోరెద నేను శ్వేతద్వీపమ్మున నేతదర్థంబు తపంబొనర్చుచు సిద్ధులగు తపస్విగణంబులు పొడచూపిరిగాని తద్రహస్యంబు గోచరింపదయ్యె. ౧౨౬

క॥ కావున నిర్గుణశక్తి ప్ర, భావము నయ్యాదిపురుషుసారమ్యంబున్
నీవ యనుగ్రహమున సం, భావించి యెఱుంగఁ జేయవలయు మహాత్మా

వ॥ అను నారదునకుం జతురాననుం డిట్లనియె.

క॥ నిర్గుణుఁడగు పురుషునిన్, నిర్గుణయగు శక్తిని మునివరులు చిత్సం
సర్గమునఁ గాంతు రోగులకు, దుర్గమము నిరూప మెట్లు దోఁచుం
జెప్పుమా! ౧౨౭

గీ॥ జ్ఞానభావ్యులు విశ్వాసగమ్యులును న, నాదినిధనులుఁ బ్రకృతియు
నాదిపురుషుఁ, డును జగద్వ్యాపకులు వీరి నెనయునట్టి, వస్తు వొ
క్కింతయును లేదు వాస్తవముగ. ౧౨౮

వ॥ సర్వభూతగతంబగు తేజంబు పరాత్మకంబని యెఱుఁగునది. ప్రకృతిపురుషులన నెల్లప్పుడు దేహామంను మిశ్రీభూతులై యేకరూపులై యవ్యయులై నిర్గుణులై నిర్మలులై నిర్మములై చిదాత్మకులై యెసంగుచుందురు. ౧౩౦

క॥ పరమాత్ముఁ డనగ శక్తియు, పరికింపఁగ శక్తియనఁగఁ బరమాత్ముఁ
డ యీ, యిరువురికుం జొప్పడు నం, తర మెఱుఁగఁగరా దదెట్టి
తత్త్వజ్ఞులకున్. ౧౩౧

క॥ విరతిగలుగు మహనీయుల, కరయఁగ నగు విశ్వమనహంకారకృతం
బు రహి నదియేరికైనన్, విరతిం గలుఁగంగ నీదు తేజన్మములన్.

గీ॥ సగుణుఁడగువాఁడు నిర్గుణచర్య నెఱుఁగు, వాఁడె! పైత్యాదికంబునఁ
బరుసనైన, రసన కలసదునే! రసారసవిచార, మెష్టి కెనయునె! పీతసి
లాదికములు. ౧౩౩

క॥ తనుఁగొనఁగ నహంకారం,బునఁబుట్టియు సగుణమగుచుఁబొల్చెడి చేతం
బున కెట్లలవడు! నిర్గుణ,మన వన్నెకు నెక్కు నారహస్యము చెపుమా.

గీ॥ అనుడు నారదుఁడిట్లను ననఘ! సత్త్వ,మనఁగ నెట్టిదియో! రజంబనఁగ
నెట్టి, దో! తమోగుణమున నెట్టిదో! వచింపు, వేఱువేఱ నిరూపించి
విస్తరముగ. ౧౩౭

వ॥ అని యడిగిన విరించి యిట్లను. కుమారా! సత్త్వరజస్తమం
బులకుఁ గ్రమంబుగ జ్ఞానశక్తి క్రియాశక్త్యర్థశక్తులను మూఁడుశక్తులుక
లవు అందర్థశక్తివలన శబ్దస్పర్శరూపరసగంధంబు లనుతన్మాత్రంబులుద్భ
వించె. ఇందుశబ్దగుణకమాకాశంబు స్పర్శగుణకంబువాయువు రూపగు
ణకంబగ్ని రసగుణకంబుజలంబు గంధగుణకంబుపృథ్వి అర్థశక్తిసమా
యుక్తంబు లగు నీ పదియును తమస్సర్గంబునాఁబడు. శ్రోత్రత్వక్చక్షూ
రసనాఘ్రాణంబు లనుజ్ఞానేంద్రియపంచకంబును వాక్పాణిపాదపాయూ
పస్థ లనుకర్మేంద్రియపంచకంబును ప్రాణాపానవ్యానోదానసమానమ్ము
లనువాయువులైదుం గలసి యీపదియేనును రజస్సర్గంబునాఁబడు ఇవిక్రి
యాశక్తిమయంబులును జడుపాదానకంబులును నగుకరణంబులు. మ
ఱియు జ్ఞానేంద్రియపంచకమ్మునకు దిగ్వాయుసూర్యవరుణాశ్వినేయులే
గురును నధిష్ఠాన దేవతలు. వీరుజ్ఞానశక్తియుక్తంబగు సత్త్వంబువలన
జనించిరి కాన వీ*రాఱుగురును బుద్ధ్యాదికం బగునంతఃకరణచతుష్టయం
బును తదధిష్ఠాన దేవత లగుచంద్రబ్రహ్మరుద్రక్షేత్రజ్ఞులు నలువురును మ
నంబునుగలిసి యీపదియేనును సాత్త్వికసర్గంబునాఁబడు మఱియుఁబర
మాత్మకు స్థూలంబనియు సూక్ష్మంబనియు రెండురూపంబులుగలవు అం
దుస్థూలంబుపాసకులకు ధ్యానయోగ్యంబు, నాశరీరంబుసూత్రంబు నాఁ
బడు. ఇఁకఁబరమాత్మునిస్థూలశరీరంబెట్టిదన! పంచీకృతసూక్ష్మభూతంబుల
వలనమహాభూతోత్పత్తియగు. అందుఁ బంచీకృతోదకంబునఁబ్రతిబింబి
తమధ్యమాధికారిచైతన్యమునకు దేహమున"నహ"మను తాదాత్మ్యంబుద
యించు. అందువిశేషాభిమాని యగుచైతన్యంబ యాదినారాయణసంజ్ఞ
కంబు,పంచీకరణంబుచే నాకాశాదిమహాభూతవిభాగముదృఢీకృతమగు.

---

* ఇందశ్వినులిద్దఱుగాఁ జూడఁదగు.

పదఁపడి శబ్దాదిగుణంబులేకైకవృద్ధిక్రమంబుననిందువఱలుచుండు నదియె ట్లన్న? నాకాశంబునకు శబ్దంబొక్కటియగుణంబు వాయువునకు శబ్ద స్పర్శమ్ములును నగ్నికి శబ్దస్పర్శరూపమ్ములును జలమ్మునకు శబ్దస్పర్శరూపర సమ్ములును బృథివికి శబ్దస్పర్శరూపరసగంధమ్ములైదును గుణమ్ములై చెల్లు నిట్టిగుణమేళనంబున బ్రహ్మాండంబుద్భవించె, సమస్తజీవమ్ములును బ్రహ్మా ణ్డాంశసముద్భవమ్ములుగా నెఱుంగునది జీవరాసులసంఖ్య యెనుబదినాల్గు లక్షలు. ఇంకసత్త్వాదిగుణంబులస్వరూపం బెఱింగించెద నని యిట్లనియె.

## సత్త్వాదిగుణస్వరూపము

సీ॥ ప్రీత్యాత్మకంబుగా వెలయు సత్త్వము సుఖమువలనఁ బ్రీతి సంభూత మగును, నార్జవం బొకటి సత్యంబు శౌచంబు శ్రద్ధాక్షమాసంతోష ధైర్యములును. శాంతియు దయయు లజ్జయుననువీనిచే సత్త్వప్రతీతి నిశ్చయము సుమ్ము, మఱియు సత్త్వమ్ము ధర్మప్రీతికరమును శ్వేతవ ర్ణమ్మునై చెలఁగుచుండుఁ; గీ॥ దనరు సాత్త్వికరాజసతామసమ్ము లనఁగ శ్రద్ధలు; మూటిలో నాద్యమైన, దాని వృద్ధి యొనర్చు సత్త్వమ్ము; తక్కుఁ,గలయసచ్ఛ్రద్ధల నడంచి కలఁచుఁ బుత్రి. ౧౩౭

వ॥ రజోగుణంబు రక్తవర్ణంబును దుఃఖజం బగుప్రీతిం గలుగఁజే యునదియు నని యెఱుంగునది. ద్వేషంబును మాత్సర్యంబును ద్రోహం బును నుత్కంఠయు నిద్రయు రజశ్శ్రద్ధయు మానంబును దమమ్మును గర్వమ్మును రజోగుణజన్యంబులు, విచక్షణులగువారు వీనింబట్టి రజోగు ణంబు నిశ్చయింతురు. ౧౩౮

సీ॥ మఱియుఁదమోగుణంబెఱుఁగుము కృష్ణవర్ణముగ; మోహము విషా దము నెసంగఁ, జేయు నియ్యది; దీనిచేష్ట లాలస్య మజ్ఞానమ్ము నిద్ర యు దీనతయును, గార్పణ్యము భయమ్ముఁ గౌటిల్యము వివాదరోష వైషమ్యముల్ దోషదర్శనంబును నాస్తికత్వంబును తామసశ్ర ద్ధయు,వీనిచే సత్పురుషులు; గీ॥ తమము నిర్ణయింత్రు తద్దయు శుభ ముల, నిచ్చగించువార లిందు సత్త్వ, మెసఁగఁ జేసి రజముపసఁ గసి మసఁగుచుఁ, దనుము సంహరింపఁ దలఁపవలయు. ౧౩౯

చ॥ అరయఁగ నొక్కటొక్కటికి నాశ్రయమై కనుపట్టుటం బర
స్పరము విరోధభావమును బొల్పడనీయక వీని మూఁటినిం
గర మనుకూలరీతిఁ గనఁగాఁ దగు నియ్యవి మూఁటికిం బర
స్పరము విరోధముల్ సలుపుఁ బట్టకయుండిన ముప్పొమూఁడెడిన్.

వ॥ మఱియు నింక నిద్దానినవిస్తరించెద నాకర్ణింపు మెయ్యది యైన వినినంతమాత్రన ఫలంబుచేకూర దెట్లంటేని! కామక్రోధాదివర్జితుఁడు గానివానితీర్థయాత్రాదికంబునుం బోలె ననుభవరహితం బగు శ్రవణంబు వ్యర్థంబు. కామక్రోధలోభమోహమదమాత్సర్య తృష్ణా ద్వేషాసూయేర్ష్యాఽక్షమాఽశాంతులనునియ్యవియెందాఁక నాశ్రయించియుండు నంతదనుకఁ బురుషుండు పాపాత్ముండు, వాఁ డెయ్యది యొనర్చిన నిష్ఫలంబు. కర్షకుఁడు శ్రమంపడి తగుకాలమ్మున బీజావాపంబొనర్చి యహోరాత్రమ్ములు గాచి తుదకు ఫలకాలమ్మున నిద్రవోయిన ఫలంబు మృగాధీనం బగుభంగి నెంతశ్రమమ్మునఁ దీర్థయాత్రాదికం బొనర్చినను గామాదుల జయింపఁడేని ఫలమ్ముఁ జెందనేరఁ డని చెప్పి మఱియును.

మ॥ సరవిం శాస్త్రవిచారణంబుకతనం సత్త్వంబు వర్ధిల్లుఁ ద
త్పరతం జేసి క్రమక్రమమ్మునఁ దగుం వైరాగ్య; మద్దానిచే
త రజంబుం దమముం ద్యజించి కడువిద్యావంతుఁడై బ్రహ్మవి
ద్వరుఁడై ముక్తినిఁ గాంచు మానవుఁడు తథ్యం బింతయుం నారదా

వ॥ లోభయోగంబున రజం బుత్కటం బయ్యేనేని సత్త్వతమంబుల నణంచు నట్లు తమంబును మోహయోగమ్మునం జేసి ప్రవృద్ధంబై సత్త్వరజంబుల నణంచుఁ దత్ప్రకారంబు వేఱ్వేఱ విస్తరించెద. ౧౮౩

సీ॥ సత్త్వ ముత్కటమై రజస్తమోభవములౌ బాహ్యార్థముల డిందుప
అచిపేర్మి,యజ్ఞాదికమ్ముల నాసక్తి గొల్పి సాత్త్వికభోగములయందుఁ
బ్రీతిఁ జొనిపి, మోక్షమ్మున మనమ్ము దీక్ష వహించు నట్లు రజోగు
ణము వృద్ధి నందె నేని, దగుసనాతనము లౌ ధర్మంబు లడఁగు రజ
శ్శ్రద్ధ పొసఁగు నెసంగు నర్థ; గీ॥ మనుసరించును భోగంబు లఖిల
ములును, సత్త్వతమములు మొదటికి సమసిపోవు, నట్ల తమమును
నుత్కటం బయ్యేనేనిఁ, బ్రథమమున వేదశాస్త్రవిశ్వాస మడఁగు

గీ॥ మఱియుఁ దామస మగుశ్రద్ధ మదిని దవిలి,వ్యయ మొనర్చు ధనంబు
ద్రోహములు సేయు, శాంతిఁ గనఁ డెన్నటికినైనసత్త్వరజము, లడఁగు
మొదటికి స్వేచ్ఛావిహార మమరు. ౧౪౫

క॥ క్రమమునసత్త్వమురజమును,దమమును నన్యోన్యమిథునధర్మంబునక్షీ
రమునీరముఁ బలె నన్యో, న్యము కలసియ యుండు విడిచి యుం
వడ కుండుర్. ౧౪౬

గీ॥ రజముసత్త్వంబు సత్త్వమ్మురజము తమము, సత్త్వరజముల విడిచి
యెచ్చటను నొక్క, టొక్కటిగఁ గానరావు సంయుక్తధర్మ, కలిత
ములు జన్యజనకతాకలితములును. ౧౪౭

క॥ సత్త్వము రజస్తమములకు,సత్త్వరజంబులకుఁ దమము జనకంబగు నా
సత్త్వతమములకు రజమును, దత్త్వముగ జనకమగు విను తత్త్వజ్ఞనిధీ.

చ॥ జనకత మృద్ఘటక్రియ నెసంగు గుణంబులు మూడు బుద్ధి నె
వ్వాని సతతంబుఁ గామములకుం బురికొల్పుచు నుండు నాదికిం
గనఁగ రజంబు జాయ, నెసకంబున నిద్రయు దానిజాయ యై
చను నివి రెండునుం దమము జాయ లిటుల్ దగుయుగ్మభావముల్.

వ॥ అనుడు నారదుం డిట్లను మహాత్మా! నీచెప్పినగుణలక్షణం
బుకతన నాకుఁ దృప్తిచొప్పడదు. న న్ననుగ్రహించి యీగుణపరిజ్ఞా
నంబు తెల్లమగునట్లు బోధింపుమన నతం డిట్లనియె. ౧౫౦

క॥ ఏనెఱిఁగి నంతవట్టును, బూని యెఱింగింతు వినుము పుత్రా! సమ్య
గ్జ్ఞానము నాకును నలవడ, దైనను వచియించువాఁడ నాలింపుమొగిన్.

చ॥ పతికిని బంధుసంతతి కపారముదం బొడగూర్చునట్టి య
య్యతివయ యెల్లవేళ సవతాలికి నప్రియయౌఁ గదా! యటుల్
మఱిఁబరికింపసత్త్వము తమంబు రజంబును బీడఁబెట్టు నీ
గతియ రజస్తమంబులకుఁ గన్పడు స్వేతరమందు నారదా. ౧౫౨

వ॥ సత్త్వంబు స్వభావసుభగంబయ్యు స్వేతరసంపర్కమ్మునం జేసి
వికృతిం గొలుపు నది యెట్లంటేని, ౧౫౩

ఉ॥ జా నగుజవ్వనంబు కడుఁ జక్కఁదనంబు నయంబుఁ గామశా
స్త్రానుగతప్రచారమొలయం దగు జవ్వని సత్త్వరీతులం
బూని చెలంగుచున్ సవతిపోరునఁ దానును దుఃఖమొందు చం
దానఁ దదన్యభావమును దాలుచు సత్త్వము వైకృతస్థితిన్. ౧౫౪

క॥ కనుఁగొనుము జోరులకు భీ,తిని గొల్పెడిసేన చోరధిక్కృతు లగుస
జ్జనులకు సుఖదం బగున,య్యనువున గుణమ్ములకును నగుభిన్నగతుల్

మ॥ ఘననిర్ఘోషవిశేషమై తిమిరయుక్తంబై కనచ్చంచలా
జనితత్విద్యుతమైనదుర్దినము బీజం బూడ్చి నిశ్చింతఁ గై
కొని కూర్చుండినకర్షకావళికిఁ గుల్కున్ గూర్చియున్ దున్నఁజొ
చ్చినతక్కుంగలవారికిన్ శ్రమదమై చెన్నారదా నారదా. ౧౫౬

చ॥ అదియునుఁగాక వర్షఋతు వన్నిసుఖమ్ములుగల్గు వారినె
మ్మదికి ముదం బొసంగియును మన్ననఁజేయు ప్రియుండు దూరమై
కదలినవారికిన్ నిలువఁగాఁదగు గేహము కాష్ఠజాతమున్
మొదలుగ లేనిగేస్తులకు మోదమిడందగునే! గ్రహింపుమా. ౧౫౭

చ॥ మనము వినిర్మలంబయి సమంబుగ నింద్రియముల్ పదార్థముల్
గొనఁగ సమర్థతం బొరసికోలు ఘటించి శరీరమందుఁ జు
ల్కన గనుపట్టి శాంతి పొడకట్టుతఱిన్ జనుఁ డెన్నఁగాఁ దగున్
దనయెడ సాత్త్వికం బగువిధం బధికం బయి చెన్నుమీఱుటల్.

గీ॥ రజమునకు లక్షణములు నిద్రావిజృంభ, ణంబు జృంభాతిరేకతం
ద్రావిశేష, చిత్తచాంచల్యపరదేశజిగమిషలును, బాపబుద్ధివివా
దతాత్పర్యములును. ౧౫౯

క॥ కాయము బరువగు నక్షని, కాయమును మనంబు శూన్యగతిఁ
గను నిద్ర, పాయమ్మైనయుఁ దమం బ, త్యాయతమై యేరికేనిఁ
దల కెక్కుతఱిన్. ౧౬౦

చ॥ అనవిని నారదుండను మహాత్మ! గుణంబులు భిన్నభిన్న వ
ర్తనములు గా వచించి తొకతావునకున్ సమకూడెనేనిఁ గ
ల్గునె మఱికార్యసిద్ధి! రిపుకూటమదొక్కెడఁ గూడుకొన్నఁ జే
టెనయున కాని కార్యగతి యొచ్చటనేని ఫలింపనేర్చునే. ౧౬౧

వ॥ అనవుడు విరించి యిట్లను.

క॥ తైలము వర్తియు నగ్నియు, లోలోనవిరుద్ధరీతులుగ నుండియుఁ దా
మేళ్లఁ గార్యమొనరుపఁ,జాలునో గుణములును నట్లచాలెడిఁబుత్రా

వ॥ అని పితామహుండు తనకుం జెప్పిన చొప్పున నారదుండు నాకెఱింగించె నయ్యది నీకెఱింగించితి. గుణంబులన విశ్వకారణంబులు శక్తియన! జగద్వ్యాపినియై సగుణయనియు నగుణయనియు రెండు తెఱంగులనొప్పు. పురుషుండనఁగ! నిరీహుండును నవ్యయుండును బూర్ణుండునై కార్యకారణభావమ్ములు లేక చెన్నారు. సదసదాత్మకంబగునీప్రపంచంబంతయుమహామాయయగుశక్తియనిర్వహించు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులునుసూర్యచంద్రులును అష్టవసువులునుఅష్టదిక్పాలకులును గుమారవినాయకులు మొదలగు దేవతలును శక్తిసంయుక్తులగుటంజేసియ తత్తత్కార్యనిర్వాహకులగుచుందురు కాన నమ్మహాశక్తినారాధింపు మని చెప్పి వ్యాసుండు మరల జనమేజయున కిట్లనియె. ౧౬.౩

ఉ॥ ఆజగదంబ నాకలుషహారిణి నాజగదంతరాత్మ నెం
తే జపియించి సద్గతుల నెందఱు వొందరు నీవుఁ గూడ నా
యోజ నఖండభక్తి చెలువొందఁగ నాపరదేవతాంఘ్రులఁ
బూజ లొనర్చి యేరికిని బొందఁగరానిఫలంబు నొందుమా.

వ॥ మఱియు నద్దేవిమహత్త్వం బింతింతయే? వ్యాఘ్రాదిసందర్శనభయంబునఁ దదీయబీజాక్షరం బగునైకారంబు బిందురహితంబుగ నేని యెవ్వండొక్కపరి యాదృచ్ఛికంబుగ నుచ్చరించు నవ్వాఁడు పూర్ణకాముండగు నిందులకు దృష్టాంతంబుగ నిరక్షరకుక్షియగు సత్యవ్రతుం డనుద్విజకుమారుండు కిటిముఖోద్గతంబగు నైకారంబు బిందురహితంబుగ ననుకరించి నంత దయార్ద్రహృదయ యగు పరమేశ్వరి యతనిం గవిరాజుగ నొనర్చె ననుడు జనమేజయుం డతని కిట్లనియె.

క॥ సత్యవ్రతుఁ డన నెవనియు, పత్యం! బవ్వాని కెట్లు పరమేశ్వరి సం
ప్రీత్యనుగతయై వర మిడె, సత్యవతీతనయ! నాకు సత్యము చెపుమా.

గీ॥ కిటిముఖంబున బీజంబు గెరలుటేమి!, దాని సత్యవ్రతుఁడు మది
నూనుటేమి!, జగదధీశ్వరి కానంద మగుటయేమి!, చిత్ర మియ్యది
వివరించి చెప్పు మనఘ. ౧౬౭

వ॥ అనవుడు వ్యాసుం డిట్లనియె. నే నొక్కనాఁడు తీర్థయాత్రకై వెడలి సకలమునిశరణ్యం బగునైమిశారణ్యంబునకుం జని యట లోమశాదిమునీంద్రులకుం బ్రణమిల్లి కథాప్రసంగంబులఁ గాలక్షేపం బొనర్చుచున్నంత జమదగ్నిమహాముని యొకప్రసంగంబున నమ్మునులం గాంచి యిట్లనియె. ౧౬౮

చ॥ మునివరులార! రుద్రహరిముఖ్యులు దేవతలో! దిగీశులో!
యినుఁడో! నిశాధినాయకుఁడో! యింక మఱెవ్వరు సేవ్యులో! మనం
బునఁ దగఁ జర్చ చేసి యనుభూతగతిన్ వచియింపుఁ డంచుఁ బ
ల్కిన విని లోమశుండు పలికెన్ జమదగ్ని మహామునీంద్రుతోన్.

క॥ శుభమిచ్చగించువారల, కభయవిధాయినియుఁ బాపహారిణియుమహా
విభవయు నభవయు నగునల, యిభరిపువాహ యగుజననియే
సేవ్య సుమీ. ౧౭౦

వ॥ స్మరణమాత్రమ్మున సర్వసౌఖ్యమ్ము లిచ్చునది యాపె కాని తక్కొరులుగా రిందుల కితిహాసం బొక్కండు కల దాకర్ణింపుము.

క॥ కోసలదేశంబున నొక, భూసురుఁ డనపత్యుఁ డగుచుఁ బుత్రునికొఱకై
చేసెను దమసాతటమునఁ, దా సవ మొక్కెడ దేవదత్తుఁడు పేర్మిన్

## సత్యవ్రతోపాఖ్యానము

సీ॥ వేదవేదాంగవిద్యాదర్శనాపరబ్రహ్మ సుహోత్రుండు బ్రహ్మ యయ్యె,
వేదంబునకు మాఱువిధి యొనర్చినయాజ్ఞవల్క్యమౌనీంద్రుఁ డధ్వర్యుఁ
డయ్యె, నమరేంద్రునకు గురుత్వ మొనర్చెడికళాధినేత బృహస్పతి
హోతయయ్యె, నాగమతంత్రవిఖ్యాతుండు పైలుఁ డత్యూర్జితా
త్ముండు ప్రస్తోత యయ్యె; గీ॥ ఘనుఁడు గోబిలమౌని యుద్గాత
యయ్యెఁ, దక్కఁగలవారు దక్కుఋత్విక్కు లైరి, సుతునిఁ బడ
యఁగఁ గోరిభూసురుఁడు దేవ,దత్తుఁ డొనరించునట్టి సత్రంబునందు.

క॥ ఆతఁడు సామాగము వి, ఖ్యాతంబు రథంతరంబు నలగోబిలుఁ డు,
ద్గాత సుసప్తస్వరసము, పేతము గా నుచ్చరించె వేల్పులు మెచ్చన్.

వ॥ తత్సమయంబున నాతనికి దైవికంబుగ నిశ్శ్వాసంబు వొడమి స్వరభంగం బగుఁడు యజమానుం డతని కిట్లనియె. ౧౭౫

ఆ॥ వె॥ సుతునికొఱకుఁ జేయుక్రతు విధి మత్కామ్య, కర్మమునకు విఘ్న కర్త వగుచు, శ్వాస మొదలఁ జేసి స్వరభంగ మొనరించి, తేమనం గలాఁడ నింక మూర్ఖ. ౧౭౬

క॥ అని యజమానుఁడు తనుఁ ది, ట్టిన గోబిలమౌనియున్ గడిందియలుక నె, క్కొన దేవదత్తు నేడ్జెఁ, గనుఁగొని యనెఁ గనుల నగ్ని కణములు రాలన్. ౧౭౭

వ॥ సర్వప్రాణిసాధారణం బగునిశ్శ్వాసం బరికట్ట నొకరితరంబే? యనపరాధి నగునన్ను మూర్ఖ యని తిట్టితివి గాన నీకుం బొడముతనయుండు నిరక్షరకుక్షియు మూర్ఖుండును గాఁగలఁ డనిశపియించె నంత దేవదత్తుండు పశ్చాత్తప్తుండై గోబిలుం గాంచి. ౧౭౮

క॥ అపరాధ మేమి? యింతనె, శపియింతురె! మూర్ఖు సుతుఁడు జనియించిన నా, కుపకార మేమి! కనఁగ న, నపత్యతయ దానికన్న నధికము గాదే. ౧౭౯

ఆ॥ వె॥ ఎవఁడు గాని మూర్ఖుఁడేనిఁ బూజ్యత లేదు, విప్రుఁడైన వేఱు వెదక వలెనె; పశువురీతి శూద్రుభాతి మూర్ఖుండైన, బ్రాహ్మణుండు కర్మబాహ్యుఁ డరయ. ౧౮౦

క॥ ఏరా జేలెడిభువిఁ బెం,పారున్ మూర్ఖుండు పూజ్యుఁడై విప్రుఁడు;భూదారుం డాతఁడు నింద్యుం, డా రాజ్యము విడుచుటొప్పు ననఘులు విబుధుల్. ౧౮౧

క॥తన దేశమ్మునఁ గలమూ, ర్ఖుని విప్రుని రాజు దున్న కొనువానిఁ గఁజే యనగున్ బన్నిదుశూద్రుని, గనుగతి నవ్వానిఁ జూడఁగాఁ దగు నెందున్. ౧౮౨

క॥ భూసురశూన్యంబుగఁ దా, జేసినను౯ శ్రాద్ధ మొకటఁ జేయఁగ వచ్చు౯, బో! సేయరాదు మూర్ఖుని,బోసేయఁగఁబెట్టి యెట్టి ముప్పు ననేని౯. ౧౮౩

క॥ జడుఁడైన విప్రునకునె, వ్వాఁడు నేమియు నీయరా దవశ్యమయే నె క్కుడుగనిడక పొట్టకుసరి,పడునన్నము పెట్టి పంపవలయు౯ బ్రాజ్ఞుల్.

క॥ తానును మూర్ఖుండగువాఁ,డేనియు నవ్వానిధనము నెవ్వండు దినం గానేమి కొఱఁత!నింబఫ, లానీకము కాకభోగ్యమగుటయుఁ దగదే.

ఉ॥ భూపతిచేత మన్ననలు పొందఁగ నర్హుఁడుకాఁడు దేవతా శాపరిపూర్తికిం దగినసత్కృతికిం గొఱగాఁడు పైతృకో ద్యాపన మాచరించుటకుఁ దజ్జ్ఞులు పిల్వఁగ సంశయింతు రిం కేపనిసేయఁగా వలయు! నిట్టిసుతుం గని మానిసత్తమా. ౧౮౬

తే॥ గీ॥ అయ్యా! గోబిల! సంసారమందు మూర్ఖ,పుత్రితకు మించుకష్ట మ్ము పుడమిఁ గలదె?,అంతకన్నను జావుమే లన్యమేది, యేనియు భరింపనగుఁ గృపఁ బూను మనసు. ౧౮౭

క॥ అని చరణంబులఁ బడు న, య్యనఘాత్ముని దేవదత్తు ననుకంపాదృ ష్టినిగనెగోబిలుఁ;డెందు౯,ఘనులకుఁ గోపంబుక్షణముకన్న నిలుచునే

ఆ॥ వె॥ సహజశీతలంబు జల మది యగ్నిచేఁ, గాని యాతపమునఁగాని కాఁగు, దానిపొత్తు విడిచి తనగుణంబును గాంచు, నట్లె శాం తులకును నబ్బుశాంతి. ౧౮౯

క॥ శాంతుఁడయి గోబిలుఁడు ధీ, మంతుం ఁడో దేవదత్త! మఱి నీపుత్రుం డెంతయు మూర్ఖుండయ్యె న; నంతరమున బుద్ధిమంతుఁ డగుఁ గవియు నగు౯. ౧౯౦

ఆ॥ వె॥ అనుడు దేవదత్తుఁ డతిమోదమంది యి, ష్టిని సమాప్తిఁచేసి యనఘులైన, ఋత్విజులను సత్కరించె నంతకుఁ గొంత, కాల మునకు నతనికాంత యెలమి. ౧౯౧

క॥ రోహిణి యనుపేరివరా, రోహ కలితగర్భ యగుచు రోహిణి గలపు
ణ్యాహమ్మున సుతుఁ గనెఁ గడు, మోహమ్మున జాతకర్మము నతఁ
డొనర్చెన్ . ౧౯౨

వ॥ పిదప నక్కుమారునకు శుభదినమ్మున సుతథ్యుం డనుపేరు
పెట్టి విధిచోదితం బగుకాలమ్మున నుపనయనం బాచరించి వేదంబుఁ జెప్ప
నారంభించుటయు, ౧౯౩

ఉ॥ ఓ మని తండ్రి చెప్ప నతఁ డూరక చూచు "నిదేమి పాప మో
రీ! మఱుమాట లే" దనిన నేడున సాఁగు మఱేమియందు! నా
సోమరిపోతు నా వెడఁగు శుంఠఁ; జనెన్ బది రెండునేడు లి
ట్లోమెయి సంధ్యవార్చువిధ మైన నెఱుంగఁ డిఁ కేటివేదముల్.

క॥ ఇటు మూర్ఖునైనకుమారున్, గటకటపడి జననియున్ జనకుఁడున్ లోలో
మటమట లాడెదరఁట! యక్కట! యితరుల కెన్న నతఁడు గర్భావ్యా
డకాఁడే. ౧౯౪

క॥ జననీజనకులయాదర, మెసఁగునిజన్మంబు జన్మమే? యని వైరాగ్యని
యతుఁడగుచు సుతథ్యుడు,వనమున కేతెంచె లోన వగ గడలుకొనన్

ఆ॥ వె॥ మూర్ఖుఁ డైనకొడుకు పుట్టుటకన్నను,గ్రుడ్డియైన మఱియుఁ గుం
టియైన, మే లటంచు నతనిమేలు గణింపక, తల్లిదండ్రులు
మది దలఁప రైరి. ౧౯౫

వ॥ అతండును గంగాతీరమ్మున నొకపర్ణశాల నేర్పఱచుకొని
వసించుచుఁ బ్రతిదినంబును శూద్రునింబలె నమంత్రకంబుగ స్నానం
బాచరించుచు ఫలమూలాదులఁ గాలక్షేపం బొనర్చుచు సత్యంబుదక్క
వేఱొండు పల్క నని వ్రతం బూని యట నున్నంత జను లందఱు
నాతని సత్యతపుం డని పల్కిరి. ౧౯౬

క॥ అపకారంబొనరుపఁడఁట!,యుపకారంబంతకన్న నొసరుపఁడఁట!యా
తపమునకన్న మఱింకొక,తప ముండునె యెంచిచూడఁ దత్త్వజ్ఞులకున్

సీ॥ తగుమాప మలవడి సుగుణంబుల నెసంగి వంధ్యయై యొప్పుజవ్వని
విధమునఁ, గొమ్మలనొప్పి పూగుత్తులఁ జెలువారి సఫలము గానివృ

షమువడుపున, బలుపెక్కి మిగులఁ జూపులకుఁ బ్రియమై కొంచెమైనను
పాలీనియావుపగిది, ధనధాన్యములు గల్గి తగురాజ్యముండి దాతృ
త్వము లేని పార్థివునిమాడ్కి; గీ॥ నుత్తమద్విజకులమున నుద్భ
వించి, చదువుసంధ్యయు లేక నిష్ఫలుఁడనైన, నాకు మరణంబుకన్న
నన్యంబు శరణ, మున్నదే? యటంచు నతఁడిట్టులూహ సేయు.
చ॥ వెనుకటిజన్మమందు నొకవేదపుఁబుస్తకమైన విప్రనం
దనునకు దాన మిచ్చుసుకృతమ్మునఁ బోవనినాకు విద్య క
మ్మనిన నదేలవచ్చు నకటా! విరిబోఁడియు విద్యయుఁ ధనం
బును దొలిజన్మమం దిడనిమూర్ఖులకుఁ లభియింప నేర్చునే. ౨౦౨
క॥ నాతోఁడివా రఖిలవి, ద్యాతంత్రమ్ముల సమర్థులై యుండఁగ నా
కీతీరు గలుగు టెన్నఁగ, నాతొలిజన్మంపుఫల మసంగాఁ గదే.
క॥ ఏవారి దూఱ నేమగు, దైవాధీనములు సకలతంత్రమ్ములు నా
దైనగతి దాఁటఁ దరమే?, యానారిజభవునికైన నభవునికైనన్.
వ॥ అనివిచారించుచుఁ బావనోదకంబగు నవ్వనమ్మున జపతపము
లెఱుంగక కాలయాపనం బొనర్చుచున్నంత నతని మునులెల్లను సత్య
వ్రతుం డనిరి. ఇట్లు పదునాలుగేండ్లు గతించు పిమ్మట నొక్కనాఁడు,
చ॥ యమసమదేహుఁడుఁ వనవిహారియు బాణధనుర్ధరుండు దు
ర్గమభుజశాలియొక్కఁడు కిరాతుఁడు వేఁటకు వచ్చి యొక్కకో
లముఁ బడనేయ నయ్యది తలంకుచు భూసురపుత్రునగ్రభా
గమునఁ బలాయితంబగు చొకానొక రావ మొనర్చె నార్తమై.
వ॥ దైవవశంబున నయ్యది సారస్వతబీజం బయ్యెఁ దత్ప్రభావం
బెఱుంగనివాఁడయ్యు నతండు, ౨౦౭
క॥ కోలము కిరాతబాణ, వ్యాలోలం బగుచు నిట్లు పలికె నటంచున్
జాలిమెయిఁ దదనుకరణము, వాలాయము సలిపెఁ దపమువడు
వున నంతన్. ౨౦౮
వ॥ అయ్యడవిపందియుఁ దత్సమీపస్థం బగునొక్కపొదరింటం
డాఁగుడుఁ దదన్వేషణంబునకుఁ గిరాతుం డేతెంచి సత్యవ్రతునకుఁ మ్రొక్కి
యిట్లనియె. ౨౦౯

ఉ॥ తీవ్రశరంబు దాఁకి చనుదెంచెను గోలము దేడకేగ నో
సువ్రత! చెప్పి యాఁకటను జొక్కుకుటుంబము నుద్ధరించి స
త్యవ్రతనామధేయము యథార్థము సేయఁగదయ్య! మాకిరా
తవ్రజ మిట్లుగా బ్రతుకఁ ధాత విధించినధర్మమేకదా. ౨౧౦

క॥ తనకులవృత్తి విడువఁ దగ, దని మావిప్రులె వచింతు రది గాకేవృ
త్తినినైనఁ దనకుటుంబం,బును బోషించు టది తగదె? భూసురవర్యా.

ఆ॥ వె॥ అనుకిరాతుపల్కు లాలించి సత్యవ్రతుండు చెప్ప కూరకుండెఁ
జెప్ప, కున్నఁ దనవ్రతంబు బన్నంబు జెందుఁ జెప్పిన నఘంబు
జంతుపీడవలన. ౨౧౨

వ॥ అని ప్రాణిసంరక్షణార్థం బగునసృతంబున వ్రతభంగంబు గా
మి నిశ్చయించి నిరుత్తరుండై తట్కోటిముఖోద్ధంబగు సారస్వతబీజం బు
చ్చరించుచున్నంత, ౨౧౩

క॥ అంబ! కృపగలిగి ప్రత్యక్షంబై యవ్విప్రసుతునిఁ గవితావాప్తిఁ
కిం బొనరిఁచె నఁట! తద్బీజంబు పఠించిన నరులకుఁ జదువులుకొదవే.

వ॥ ఇట్లు పరదేవతానిర్హేతుకకటాక్షమ్మునం జేసి నిరంకుశకవి
తాప్రభావమ్ముఁ జెంది యాసత్యవ్రతుం డక్కిరాతుంజూచి యీశ్లో
కంబు నుడివె. ౨౧౪

*శ్లో॥ యా పశ్యతి న సా బ్రూతే, యా బ్రూతే సా నపశ్యతి
అహో వ్యాధ స్వకార్యార్థిన్, కింపృచ్ఛసి పునఃపునః, ౨౧౫

వ॥ అనుడు వ్యాధుండు నిరాశుండై యరిగె సత్యవ్రతుండును
మహాకవియై తద్బీజమ్ముజపియించుచు విఖ్యాతిం బడసె ౨౧౬

చ॥ అతని కవిత్వమున్ విని యహా! యని మెచ్చెడివారుఁ బండితుం
డితఁడొకఁడే యటంచు నుతియించెడివారు నమస్కరించువా
రతులవిభూతిఁ గానుకల నంపెడివారు సరస్వతీదయా
గతకవితానుభావులకు గౌరవసంపద లబ్బు టబ్రమే. ౨౧౭

---

* క॥ ఎదిచూచును యది చెప్పదు, విదితము గాఁ బలుకునేది వీక్షింపని ద
య్యది సారెసారె నేమడి, గెద? వెవ్వగ చెప్పవా? రొగిన్ జనుమృగయా.

ఆ॥ వె॥ అట్టి తనయుఁగాంచి యాసందమందిరి, తల్లిసంద్రు లెంత ధన్య తములొ, ముందు మూర్ఖుఁడైన పుత్రుఁడు తుదకు జ, గత్ప్రసిద్ధమైన కవితఁగాంచె. ౨౨౦

ఉ॥ కావున నంబికాకరుణ గాంచినవానికి నెందు విద్యగా నీ విభవమ్ముగాని మతియెద్దియుఁ గాని యసాధ్యమే? మునీంద్రా! వినుమంచుఁ జెప్పె జమదగ్నికి లోమశమౌని; నీవునున్ భూవర! యంబికాకరుణఁ బొందుము చెందుము సర్వసంపదల్.

క॥ ఆ యంబ! ప్రీతిఁ జెందుట, కై యజ్ఞ మొనర్పు మఖిలమగు కామంబుల్, శ్రీయునుసంపదయును విప్రు, లాయుర్దాయాదికంబునలవడునీకున్

ఉ॥ దీనులు రోగపీడితులు దృగ్వికలుల్ క్షుధితుల్ శఠుల్ పగా ధీనులు మూర్ఖులున్ విగతతేజులు రిక్తులు నాదిగాఁగ నీ మానవులున్ గ్రహింపు మనుమానమునన్ దొలిజన్మమందుఁ చ ద్ధ్యాన మొనర్పకున్కిఁ బరమాతురులై రిపు డంచు భూవరా. ౨౨౩

సీ॥ తులలేని యైశ్వర్యముల నెసంగెడివారు పుత్రపౌత్రులకల్మిఁ బొల్చువారు, వేదవేదాంగాదివిద్యలుకలవారు భోగమ్ములను దులఁ దూఁగువారు, పుష్టికల్గినగాత్ర యష్టిఁబొల్చెడివారు సామ్రాజ్యవిభవ మెసంగువారు, పదిమంది బందుగుల్ బలిసి కొల్చెడివారు సర్వథా సౌఖ్యముల్ జరుగువారు; గీ॥ నెల్లకాలము శుభముల నెనయువారు మొదలు గాఁగలవారలు మున్ను జగద, ధీశ్వరిని దేవదేవిని దెలివికలిమి, నెఱిఁగి కొల్చినవారని యెఱుఁగు మధిప. ౨౨౪

## దేవీయజ్ఞవిధానము

క॥ కావున దేవీమఖముం, గావింపు మటన్న వ్యాసుఁగాంచి పరీక్షిద్భూవరతనయుఁడుజననుత, భావుఁడు జనమేజయుండుపలికెన్ బేర్మిన్.

క॥ దేవీయజ్ఞవిధానం, బేవిధమున నుండు దాని కేయేవస్తువుల్, గావలయు నాకు సానతి, యీవే! కృప ననుడు వ్యాసుఁ డిట్లని తెలిపెన్

వ॥ రాజేంద్రా! సాత్త్వికంబును రాజసంబును దామసంబును నిర్గుణంబును జ్ఞానమయంబును నన దేవీయజ్ఞం బైదువిధమ్ములు గల యది యందు మునులకు సాత్త్వికంబును రాజులకు రాజసంబును రాక్షు

సులకు దామసంబును జ్ఞానులకు నిర్గుణంబును ముక్తులకు జ్ఞానమయ మ్మును గర్తవ్యంబులు సమీచీన దేశకాలమంత్రిబ్రాహ్మణద్రవ్యంబులు గలుగునది సాత్త్వికంబు నాఁబడు. ఏయజ్ఞంబు కాని ద్రవ్యశుద్ధి క్రియా శుద్ధిమంత్రశుద్ధులు లేనిచో సంపూర్ణఫలం బీనేరదు. అన్యాయార్జితం బగువిత్తమ్ముచేఁ జేసినజన్నంబు పరలోకమ్మునకు వెలియగు నిద్దానికిఁ బ్రత్యక్షదృష్టాంతంబు మనపాండవులరాజసూయం బది యెట్లంటేని,

మ॥ రమణీయుం డగుశౌరి తోడుపడ భారద్వాజముఖ్యుల్ మహో
త్తము లార్త్విజ్య మొనర్పఁ బూర్వమున మీతాతల్ తగన్ రాజసూ
యము గావించి ప్రసిద్ధిఁ గాంచి నెలలో నాత్మీయ మాసర్వరా
జ్యముఁ గోల్పోవుటకున్ గతంబు ధన మన్యాయార్జితం బౌటయే.

గీ॥ ద్యూత మాడి పరాజయోపేతు లైరి, నాతి పాంచాలి సభకు నానీత
యయ్యె, సిరి సమస్తము శత్రులచేతఁ జిక్కెఁ, దమ కరణ్యంబు
రాజ్యమై తారసించె. ౨౬౦

క॥ అటఁ బంద్రెండేడులు మి,క్కుట మగుకష్టములఁ జెంది కోమలితోఁ, బి
మ్మట విరటుఁ గొల్వ నేగిరి, కటకట! మఱి యింతకన్నఁ గష్టముకలదే.

ఉ॥ పాతకుఁ డైనకీచకుఁ డపాత్రుఁడు ద్రోవదిఁ బట్టి యెంతయున్
యాతనపా లొనర్ప నపు డాసతికష్టము మాన్పుపుణ్యపుల్
జేతకు నొక్క రైన దయ సేయ రిసీ! యదురాట్టుటాక్షసం
పాతము లేడఁ జొచ్చెనో కో? పాతులదీవన లేడఁ బోయెనో.

ఉ॥ గణ్యుఁడు కర్త ధర్మజుఁడు కంజదళాక్షుఁడు తోడునీడ బ్ర
హ్మణ్యులు ఋత్విజుల్ గడు శుభావహ మాక్రతు విందు ధర్మవై
గుణ్యము లేక యున్న సమకూడునె? యిట్టిదొసంగు; లెందునున్
బుణ్యఁపు సేఁతయైనఁ జెడిపోయిన ముప్పులు మూఁడకుండునే.

గీ॥ ధర్మవికృతియు లేక సత్రింబొనర్చు, వారలకు భంగపాటుచేకూరె
నేని, మంత్రిములు వ్యర్థములు వేదమతము తప్పు,మును లసత్యులు
తపములు ముప్పు లధిప. ౨౬౪

క॥ కావున నేకర్మంబేఁ, గావించినపిదప దొసఁగు గల్గిన దానన్, గేవల
లోపము కల దని, కోవిదు లూహింప వలయుఁ గురుకులతిలకా.

వ॥ కర్తృభేదద్రవ్యభేదమంత్రభేదమ్ములఁ గర్మవైపరీత్యంబు గలుగుచుండు. మున్ను దేవేంద్రుండు విశ్వరూపుని గురునిగాఁ గైకొని జన్నంబొనర్చిన నతండు మాతృపక్షీయు లగురక్కసులకుఁగూడ నుపకరించెఁ బిదప నిందుడు కుపితుండై తనవజ్రమ్మున నతనిశిరంబు డొల్లనేసెఁ గావున నెవ్వండేనిఁ గర్మవైపరీత్యం బొదవకుండఁ గాపాడికొనవలయు. సర్వంబు దైవాధీనంబనుట సరికాదు. ౨౩౬

క॥ మును దుపదనృపతి ఘటజ, న్మునిఁ బరిమార్పంగ జన్నమున ధృష్టద్యు, మ్నుని ద్రౌపది యనుకూఁతుం, గని ధన్యం డయ్యె వికృతి గననికతమునన్. ౨౩౭

గీ॥ దశరథుం డనురాజు సత్రంబొనర్చి, సుతుల నల్వురఁ గని జగద్ధిత మొనర్చె, నేదియేనియు సఫలమ్మై యొసఁగుపొంకె, కర్మలోపంబులేమియ కారణంబు. ౨౩౮

వ॥ సాత్త్వికం బగుజన్నం బొనర్చుట యేరికిని గష్టతరం బయ్యాది వైఖానసవ్రతనిష్ఠులును సాత్త్వికభోజనులును నగుమహామునులు సేయువారు. రాజసం బభిమానవంతు లగుక్షత్రియులకును వైశ్యులకును విహితంబు. తామసయాగంబు మదమత్తులగుదానవులకు యోగ్యంబు. మోక్షకాములకు మానసంబు కర్తవ్యంబు తత్ప్రకారంబువినుము.

సీ॥ మనము నిర్మలముగ నొనరించి గుణములు వర్జించి యింద్రియవర్తనముల, నణఁగించి దేహంబు నతిశుద్ధముగఁ జేయఁ గలవాఁడు తగునధికారిసుమ్ము, మంటపమ్మును వేది మహితాగ్నులను బుత్విజులను దక్షిణల నచ్చుగ మనమునఁ, గల్పించుకొనవలెఁ గడఁగి దీనికి హోత యజమానుఁడును గూడ నరయ మనము; గీ॥ నిర్గుణబ్రహ్మ మధిదైవనియతిఁ దనరు, నాద్యయును నిర్గుణయు నగునట్టిశక్తి, ఫలగ బ్రహ్మైక్య మిద్దానిఫలము మునులు, దీనిసేఁతకుఁ దగువారు తెలియుమధిప. ౨౪౦

క॥ ఏవంవిధ మగుజన్నం, బేవారు రచింతురో మహీయశ్శ్రద్ధా ధీనిభవు లగుచు వారే, జీవన్ముక్తు లని చెప్పఁ జెల్లుదు రధిప.

వ॥ తక్కినజ్యోతిష్టోమాదికంబునకు ఫలంబు స్వర్గంబు అయ్యది యస్థిరంబు. ఐనను మానసంబు రాజన్యులకు దుష్కరం బగుటంజేసి తాదృశంబు లగుయాగంబులు కర్తవ్యంబులు. అందుఁ దామసం బగు యాగం బొనరించి సర్పవైరంబు దీర్చికొంటివి ఇఁక రాజసం బగుజన్నం బొనర్చి ధన్యుండవు కమ్మని మఱియు నిట్లనియె. ౨౮౨

శా॥ దేవీబీజవిధానవేత్తలగుభూదేవాగ్రణుల్ ఋత్విజుల్
గా వేదోక్తవిధానరీతిగ జగద్గణ్యంబుగా వేడ్కమై
దేవీయజ్ఞ మొనర్చి దుర్మృతిగతిం దీండ్రించునీతండ్రి స్వ
ర్గావాప్తిం గనఁగాఁ బితౄణమును బాయం జెల్లదే? భూవరా!

మ॥ ఘనసంగ్రామమొ! పుణ్యభూతలమొ! గంగాతీరమో! కాక నీ
జనకుం డున్నతిసౌధరాజమున దుస్సర్పమ్ముచే దుర్మృతిం
గని ఘోరం బగురౌరవమ్మునఁ బడెన్ గాలీమహాయజ్ఞసం
జనితానంతవిశేషపుణ్యమున నుచ్చైర్లోకముల్ గూర్పుమా.

ఉ॥ చెందితి సర్వసౌఖ్యములఁ జేసితిఁ బుణ్యములన్ జిరాయువుం
బొందితిఁ గర్తబద్ధ మగుబొంది నిఁకన్ ద్యజియించి యాత్మతోఁ
బొంకఁగరానిసౌఖ్యములఁబొందఁగఁ జెల్లదె? యంచుఁ దృప్తిఁ జె
న్నొందినవానికిన్ గలుగు నుత్తమలోకము పార్థివోత్తమా.

వ॥ భవజ్జనకుం డిట్టి తృప్తిగల్గి దేహత్యాగం బొనరించినవాఁడు కాఁడు. కావున మున్ను మహావిష్ణువుచే నొనర్పంబడినదియు ననర్గళఫలదంబును నగు దేవీయజ్ఞం బొనరించి యక్కతనఁ గృతార్థు నొనర్చి పితౄణవిముక్తుండవు గమ్మనుడు జనమేజయుండు సాశ్రికంఠుండై సాత్యవతేయున కిట్లనియె. ౨౮౬

మ॥ హరి జన్నంబొనరించె నంటి వొగి నాయజ్ఞంబున న్నాథులె
వ్వారో? యద్దానివిధాన మెట్టిదో? జగద్వంద్యుండు విష్ణుండు త
త్పరతం జెందుట కేమికారణమొ? సర్వమ్మున్ గుదింగూర్చి స
త్కరుణాదృష్టి వహించి మీఁద మఖమున్ గావింపఁగాఁజేయుమా.

క॥ అనుజనమేజయుఁ గనుఁగొని, యనువ్యాసుం డధిప! విను మహాద్భుత
మగున, ట్లొనరించె మున్ను జన్నం, బును విష్ణుం డంబ మిగుల
మోదము చెందెన్. ౧౪౮

వ॥ హరిహరవిరించు లట్లు దేవీనికటంబునుండి శక్తియుక్తులై
విమానం బధిష్ఠించి స్వస్వరూపమ్ములు ధరియించి యర్ణవనికటమ్మున
కేతెంచినపిమ్మట. ౧౪౯

గీ॥ ముగురకును మూఁడు వాసముల్ తగుగతిని నొ, సర్చికొని యున్న
యంత ననంతకరుణ, మైనయామాయంబచే ముక్తయయ్యె నచల,
మైనయాధారశక్తి యద్దాని నూని. ౧౫౦

సీ॥ ధర పుట్టె నద్దానిఁ దగ మధుకైటభ మేదోభరమ్ముతో మిళితమైన
కతమున మేదిని గావచింతురు ధారణముఁ బొనర్చిన కారణమున
ధర య, నియు మహీయస్త్వంబెనయుటను మహి యనియును
విస్తృతం బగుటను బృధివి య, నియు వచింతురు దాని నెఱి
మోయుటకుఁ బర్వతములఁ జేసిరి విస్తృతములు గాఁగ; గీ॥ నందు
మేరువు కనకమయంబు రత్న, శృంగసంశోభితంబు; మరీచినార,
దాత్రిపులహక్రతుపులస్త్య లలవసిష్ఠ, దక్షులును బ్రహ్మపుత్రులై
తనరు మునులు. ౧౫౧

గీ॥ ఆలమరీచికి సుతుఁడు గశ్యపుఁడు దక్షు, నకుఁ ద్రయోదశకన్యకల్
ప్రకటమతులు, పుట్టి రమరులు దైత్యు లిర్వురును దక్ష, కన్యకల
యందుఁ గల్గిరి కశ్యపునకు. ౧౫౨

గీ॥ దానఁ గాశ్యపి సృష్టి యత్యధికమయ్యె, మనుజులును బశువులును
గ్రమముగ విస్తరించు, నంతటఁ బుట్టె విరించి దక్షి, ణాంగమున
నుండి ఘనుఁడు స్వాయంభువుండు. ౧౫౩

వ॥ అవ్విరించివామభాగమ్మునుండి శతరూప యనునొకకన్నియ
పుట్టె వీరిరువురకుఁ బ్రియవ్రతోత్తానపాదులును నతిసుందరులగుముగురు
కన్యకలును నుదయించిరి. ౧౫౪

క॥ ఏవంవిధముగ సృష్టిని, గావించి సరోజభవుఁడు గాంచనగిరియం,
దావెనుక బ్రహ్మలోకము, గావించుకొనె న్నివాసగతికై తనకున్.

వ॥ విష్ణువునకు సత్యోత్తమంబు వైకుంఠలోకంబును శివునకు రజతమయం బగుకైలాసనగంబును నివాసంబులుగాఁ గల్పించె. ౨౫౬

క॥ నానారత్న విరాజిత, మై నయనోత్సవకరంబునై తగునాక
స్థానము మేరుగిరిస్థము,గా నొనరిచి దేవతలకుఁ గానొసఁగె వెసన్.

సీ॥ మఱియు సముద్రంబు మథియించునప్పుడు నుచ్చైశ్శ్రవం బనునొక్క యశ్వ, మును నాల్గుదంతమ్ము లెసఁగిన యైరావణం బనుగజము వి న్నాణ మైన, పారిజాతం బనుపాదపంబును గామధేనువు సామ్యం బులేనిసొబగు, గలరంభ మొదలుగాఁ గలయచ్చరలు నందుఁ బొడ మినఁ గైకొనెఁ గడఁగి యిందు; గీ॥ డుదయ మందిరి జలజారియును భిషగ్వ, రుండు ధన్వంతరియును నఖండమైన, యర్ణవమునుండి వీరు దేవాంశభవులు, స్వర్గవర్తులు సృష్టి యానరణిఁజెలఁగె. ౨౫౭

వ॥ మఱియు నండజస్వేదజోద్భిజ్జజరాయుజంబు లనునాల్గుభేద ములు గలిగి కర్మవశమ్మున ననేకజీవరాసు లుత్పన్నంబు లయ్యె. నివ్వి ధంబున కృతకృత్యులై బ్రహ్మవిష్ణుమహేశ్వరులు తమతమస్థానంబుల సుఖంబుండి రంత విష్ణువు లక్ష్మితో సమస్తసుఖంబు లనుభవించుచు నొక్కనాఁడు సుధాసింధుగతం బగు మణిమండిత ద్వీపమ్మును నటఁ బొడకట్టినమహాశక్తియుఁ దన్నిమిత్తమ్మున దొరకొన్నమంత్రంబును దమకు స్త్రీరూపప్రాప్తియు మున్నుగాఁ గలసంగతులు మనమ్మునకుం దెచ్చుకొని యంబికాయజ్ఞం బొనర్పఁ గృతనిశ్చయుండై. ౨౫౮

చ॥ తనభువనంబు వెల్వడి ముదంబున నంబుజసంభవున్ భవున్
ధనదు సురేంద్రుఁ బావకుని ధర్ము వసిష్ఠుని దక్షుఁ గశ్యపున్
ఘనుఁ డగువామదేవముని కాంతు బృహస్పతిఁ దక్కువారలన్
బని గొని పిల్చి యత్నము నపారముగా నొనరించి యంతటన్.

వ॥ సమర్థు లగుసప్తవింశతిబుత్విజులఁ గూర్చుకొని సువిస్తరం బు లగువేదులఁ గల్పించి యథావిధిగ నగ్నుల నాసాదించి దేవీబీజస మన్వితంబు లగుమంత్రమ్ములచే వేల్చిన సంతసించి జగదీశ్వరి యశరీరి ణియై యిట్లనియె. ౨౬౦

ఉ॥ ఎంతయు సంతసించితి రమేశ! భవత్కృత మైనయజ్ఞ మిం
తింతగ నొప్పునే! భవదభీష్టములెల్ల ఫలించుఁగాక వా
క్కాంతుఁడు నింద్రుఁడున్ మొదలుగాఁ గలదేవతలెల్ల నిన్ను న
త్యంతము పూజ సేయ వరదాతవు గాఁ గల వెల్లవారికిన్. ౨౬. ౨

సీ॥ జన్మమ్ములను నీకు సకలదేవతలలోఁ బ్రాముఖ్య మెంతేనిఁ బరిఢ
విల్లు, రాక్షసభీతి గీర్వాణులెల్లరు నిన్ను శరణుఁగైకొని సారె సంశ్ర
యింత్రు, వేదమ్ములఁ బురాణవాదమ్ములను నీవ యధికుండ వంచుఁ
బ్రఖ్యాతి వచ్చు, ధర్మమ్మునకు నుపద్రవ మబ్బుతఱిఁ దత్త్వనవతార
ములు దాల్చి యవనియందు; గీ॥ వివిధయోనులయందు నావిర్భ
వించి, భూభరమ్మును దీర్చెడిపుణ్యమూర్తి, వై నెగడఁగలవు సిరి ని
న్ననవరతము, వదల కుండెడి నాఁదగువరము కలిమి. ౨౬. ౩

క॥ వారాహి నారసింహియు,నా రాజిలుహావములు ననసి శక్తులు నీ,
కాఁగియ సహాయులై కా, ర్యారంభములన్ సమాప్తి నందింతు
రొగిన్. ౨౬. ౪

వ॥ అట్టిశక్తుల నెన్నండును నీ వవమానింపక తగుగతి మన్నిం
చుచుండుము భూలోకంబునను స్వర్గలోకమ్మునను నీమహిమం బమేయ
మై యొప్పు నని చెప్పి విరమించిన విష్ణుండు నమందానందంబు చెంది
క్రతుసమాప్తి నొందించి యెల్లర గౌరవించి మగుల వైకుంఠంబున క
రిగి సుఖం బుండె. ౨౬. ౫

క॥ అని చెప్పినవ్యాసునిఁ గని, జనమేజయుఁ డిట్లు పల్కె సాత్యవతేయా!
మును దేవియజ్ఞం బిం,క నెవ రొనర్చిరొ వచింపఁగాఁదగుఁ బేర్మిన్.

వ॥ అనవుడు నాతండొక్కయితిహాసం బిట్లని చెప్పందొడఁగె.

## ధ్రువసంధ్యుపాఖ్యానము.

మ॥ అలరారున్ సరయూతటమ్మున నయోధ్యాపట్టణం బద్ది కో
సలదేశమ్మునకెల్ల భూషణము కంజాతాప్తవంశ్యుండు కీ
ర్త్యలఘుం డప్పురి నేలుచుండు ధ్రువసంధ్యాఖ్యుండు రారాజు వి
ప్రులు రాజన్యులు వైశ్యులుంగలరు శూద్రుల్ తత్పురిన్ ధార్మికుల్

ఉ॥ ఆతనిరాజ్యమందు నొకఁడైనను జోరుఁడు గాని జారతా
ఖ్యాతుఁడుగాని సూచకుఁడుగాని వసింపఁడు రాజ్య మీగతి
న్నీతిగ నేలునాధరణినేతకు నిద్దఱు ముద్దరాండ్రు త
జ్జాతియు నీతిరీతియును జందము నందము నందనీయముల్. ౨౬౮

క॥ ఆవిధి మనోరమయు లీ, లావతి యనఁ దనరునావిలాసవతులతో
భూవిభుఁడు సుఖంబుండఁగ నా, వెలఁదులు చూలు దాల్చి యం
తఁ గ్రమముగన్. ౨౬౯

వ॥ * సుదర్శనుండును శత్రుజిత్తు ననునిరువురు పుత్రులం గనిన రాజు వారలకు జాతకర్మాదికం బాచరించి యథావిభవంబుగ విప్రులకు దక్షిణంబు లొసంగి సమసౌహార్దమ్మున వారలం జూచుచు మనోహరు లగుచున్నకుమారులకతమున నానందమ్ముగఁ గాలక్షేపం బొనర్చుచుండె.

ఉ॥ వారలలోన జ్యేష్ఠుఁ డనవద్యతేజుండు సుదర్శనుండు, వి
స్తారవిలాసరూపసముదారవచోవిభవాభిరాముఁడున్
ధీరుఁడు శత్రుజిత్తని చెల్వికిఁ దండ్రియు మంత్రులున్ భటుల్
పౌరులు సంతసించి కడుఁబక్షమునన్ గనుచుందు రాతనిన్. ౨౭౦

వ॥ అంత నొక్కనాఁడు ధ్రువసంధి మృగయావినోదార్థం బడవి కేతెంచి యనేకమృగమ్ముల నుక్కడంచుచు నొక్కనికుంజమ్మునందలి సింహముం గొట్టుడు. ౨౭౧

మ॥ సట లింతింతలు చేసి యూర్ధ్వముగఁ బుచ్ఛంబున్ దుటాయించి వి
స్ఫుటవర్షాభ్రపటత్పటధ్వని నభోభూభాగముల్ నిండ మి
క్కుట మాకోపభరమ్మునన్ భయదమై సింహం బొకండిజన్ సుదు
ర్ఘటవేగమ్మున వెల్వడెన్ నృపవరున్ గ్రాసంబుగాఁ గైకొనన్.

వ॥ చనుదెంచునాహర్యక్షంబు నీక్షించి యతఁడు వాలును బలకయుఁ దాల్చి చలింపక రెండవసింగంబై నిలిచె. తద్భటులు తమతమ యాయుధమ్ములతో సన్నద్ధులై యనేకశరమ్ము లద్దానిపై విడుచుటయు,

ఉ॥ చెచ్చెర వచ్చి యానృపతిసింహునిపైఁ బడె ధైర్య మెంతయున్
హెచ్చఁగ నాతఁడున్ గడఁగి యేసెఁ గరాసి; మృగేంద్రుఁ డంతటన్

* సుదర్శనుఁడు శత్రుజిత్తుకన్న 1 మాసము పెద్ద.

నొచ్చి మఱింత హెచ్చి తననూతనశాతనఖాగ్రధారలన్
వ్రచ్చినఁ జచ్చె నానృపతివల్లభుఁ డేమన వచ్చు దైవమున్. ౨౭౫

క॥ ఆనృపతిఖడ్గనిహతిన్, దా నొచ్చినదగుటకతనఁ దత్‌క్షణ మదియుం
బ్రాణములు వీడి యానృపు, పై నొరిగెన్ మృతులగతులు బహు
భంగులు గా! ౨౭౬

వ॥ అంతరాజభటులు లేతెంచి జరిగిన వృత్తాంతంబెల్ల మంత్రుల
కెఱిఁగించిన వారును వసిష్ఠపురస్సరంబుగాఁ గరణీయంబులు నిర్వర్తించి
సుదర్శనునకుఁ బట్టాభిషేకంబొనర్ప నుంకించిరి. ౨౭౭

ఉ॥ దానికి సమ్మతించిరి ముదమ్మునఁ బౌరజనుల్, వసిష్ఠుఁడున్
"భూనుతుఁ డీతఁ డీతినికిఁ బోలును రాజ్య మొసంగుఁ" డంచు స
మ్మానము చూపె నంత నభిమానధనుండు యుధాజిదాఖ్యుఁ డ
న్యూనుఁడు శత్రుజిత్తున కనుంగగుతాత రయం బెఱర్పఁగన్. ౨౭౮

వ॥ జామాతృమరణంబు విని యుజ్జయినీపురంబునుండి యేతెంచె
నాలోననమనోరమాజనకుం డగుకళింగాధిపతి వీరసేనుండు తనమను
మఁ డగుసుదర్శనునకు హితం బాచరింప నటకువచ్చె నిట్లు యుధాజి
ద్వీరసేనులిరువురును తమతమదౌహిత్రులకుఁ గూర్పువారై మంత్రులతో
నాలోచించుచున్నంత యుధాజిత్తు వీరసేనునకి ట్లనియె. ౨౭౯

క॥ నీదుమనుమఁడు సుదర్శను, డాదరణీయుండు జ్యేష్ఠుఁడగుకతమున
నూ, పాదికమున జ్యేష్ఠుం డగుఁ,గాదే మాశత్రుజిత్తు గనుఁగొను
మింతన్. ౨౮౦

వ॥ లోకమ్మున వయోజ్యేష్ఠులకన్న గుణజ్యేష్ఠుల గారవింతు
రట్లగుట నామనుమఁడ రాజ్యార్హుం డనుటయు, ౨౮౧

గీ॥ వీరసేనుండు వల్కు"నీవెట్టిమాట, తగదు నాసుతయేకదా! ధర్మపత్ని
తత్తనూజుఁడు రాజు సుదర్శనుండు, జ్యేష్ఠుఁగాదని ధర్మముల్
సెప్పుటెట్లు. ౨౮౨

వ॥ అనుడు వీరసేనునకు మంత్రి లెదురాడక సుదర్శనునక
పట్టంబుగట్ట నుంకించుడు యుధాజిత్తు మంత్రులంజూచి, ౨౮౩

ఉ॥ మీరును మీరు నేకమయి మేదినికిం బతిగా సుదర్శనున్
వారక చేయ నొప్పికొను వాఁడె యతండు! బలాన్వితుండు వి
స్ఫారవివేకశాలి గుణవంతుఁడు నామనుమండు మద్బలో
ద్దారత మిమ్ము గీటడఁచి తప్పక రాజ్యము సంగ్రహింపఁడే. ౨౮౪

క॥ కరమున నేనసిఁ బూనిన, ధరణియు వశ్యలగు ననినఁ దర్పోరులకు నన్
బొరయఁగఁ దరమే మనమున, నరసికొనుఁడు మీఁద జరుగునట్టిది
యెల్లన్. ౨౮౫

వ॥ అని వీరాలాపమ్ములాడిన వీరసేనుండు యుధాజిత్తున కిట్లను.

క॥ నామనుమఁడు నీమనుమఁడు, నీమెయిని సమానులగుట యేర్పడె
మఱియున్, నామనుమఁడు జ్యేష్ఠుండ, తఁ డీమహి నేలంగఁ గర్త
యెన్నివిధములన్. ౨౮౬

వ॥ ఇట్లు వా రెడతెగనివైరమ్మున వాదించుచుంటకు నచటివా
రందఱును వ్యగ్రమానసులైరి. ౨౮౭

క॥ ధ్రువసంధినృపతిమరణం,బు విని తగన్ శృంగిబేరపురవాసులు చౌ
ర్యవిధిధనంబు హరింపఁగ,తవరవనప్వారమునకు హటాహటినడలన్.

వ॥ వచ్చి యతికోలాహలంబుగా నలుప్రక్కల వ్యాపించియుండి
రంత యుధాజిద్వీరసేనులు తమతమసైన్యములను గూర్చుకొని యుద్ధ
సన్నద్ధులైరి. ౨౮౮



యుధాజిద్వీరసేనులయుద్ధము

క॥ ధృతశస్త్రహస్తులును సం,గతసైన్యసమేతులును నఖండగుడావె, శితు
లును నగుచయ్యిరువుర,కతులిత మగుతుములయుద్ధమయ్యె నృపాలా.

క॥ దండిమెయి వీరసేనుఁడు,కొండపయిన్ గురియుమొగులు కొమరుననత్యు,
ద్దండంబుగ బాణంబుల,తండంబులు వరపె నాయుధాజిత్తుపయిన్.

క॥ వీఁక నిటు వీరసేనుఁడు,దాఁకి ప్రయోగించుశరవితానము గడు ను
ద్రేకమున యుధాజిత్తు,త్సేక మెలర్చెడిశరముల ఛేదించె వడిన్.

క॥ తురగంబులుఁ దురగంబులు, కరులుఁ గరులు భటులు భటులు గలసి
పెనఁగ నం,బరచరులును భయపడిన ని, తరులకు నాసంగరంబు
దరమే పొగడన్. ౨౯3

వ॥ అట్టియెడఁ జూర్ణంబులగు రథంబులును ఖండితంబులగు వారణంబులును భగ్నంబు లగుతురగంబులును పాతితు లగుపదాతులును దెళ్లినశిరమ్ములును దెగినకరమ్ములును బగిలినవక్షమ్ములును దగిలినబాణమ్ములునై సంగరమ్ము ప్రవర్తిల్లె. —౨౯౪

క॥ పిశితంబులఁ గ్రసియించెడి, యశనాయాపీడితమ్ము లగుబహుకంకా దిశకుంతమ్ములయార్భటి, దశదిశలాక్కటిగ మ్రోసె ధరణీనాథా!

క॥ కొండలకెనయగు మాంసపు, ఖండపుఁబోవులను వెడలఁగాఁజొచ్చె మహా, ద్దండము లగుసెలయేఱుల,తండములన రక్తములు పదంపడి యచటన్. —౨౯౬

చ॥ అరదమునుండి చచ్చిపడినట్టి శవమ్ములపైపయిన్ దివిన్ గరమును మాంసముం గొనెడికాంక్షఁ జరించెడిగ్రద్ద పెద్దని ద్దుర గనియుండియున్ సొబగుతోఁ దులఁదూఁగునిఁజాంగకమ్ములన్ బొరసెడిదేహమందుఁ జొరబోయెడిజీవుఁడు నాఁగఁ జొప్పడెన్.

చ॥ అనిఁదెగటారి యాకసమునందు విమానము నెక్కి. యంకమం దెనసి విలాసముల్ గొలిపి యింపు ఘటించెడియప్సరోంగనన్ గని యొకవీరుఁ డిట్లులనుఁ «గాంత! మదీయశరీర మెంతచ క్కని దొ గతాసువయ్యుఁ గనుగందదు కన్గొనుమా! రణావనిన్.

చ॥ ఇఁక నొకవీరుఁ డచ్చరయు నింపుగ ముచ్చటలాడుచున్ జక చ్చకితవిమానమెక్కి చనఁ జయ్యన నాతనిధర్మపత్ని య గ్నికి నెరఁజేసి దేహము నొగి న్నవదేహముఁ దాల్చి వేగఁ ద న్నికటముచేరి యాసవతినిన్ బడఁగొట్టె మగండు నవ్వఁగన్.

మ॥ అనిలో మార్కొని యిద్ద ఉద్భటభటుల్ ప్రాణంబు గోల్పోయి ట్టన నొక్కమ్మడి నేగియేగి యట మింటన్ దమ్ము నంటంగ వ చ్చిన వేల్పుంజవరాలిమిన్నఁ గని యాచిన్నారిపొన్నారి యం గనకై వెన్కటికన్న నెక్కుడురుషన్ గాట్లాడి రత్యంతమున్.

సీ॥ నాభార్యకన్న విన్నాణంబు గలదాన వంచు నచ్చర గారవించె నొ కఁడు, ఏకపత్నీవ్రతం బేమిసేయుదు ముట్టఁదగదు పొమ్మనె వేల్పు మగువ నొకఁడు,కలికి!నాచెలిమిన్నకన్న నెక్కుడుదానవా!పొమ్మనిమె

వేల్పువనిత నొకఁడు, తనప్రతాపము సెప్పి తన కనుకూలఁగాఁ
గావించుకొనె దేవకాంతనొకఁడు; గీ॥ అయినవా రెందఱో! యిప్పు
డగుచునున్న, వారలెందఱో! కాఁబోవువార లెంద, ఱో! యొకం
డంచుఁ గలఁడె మీరోయువిదల, కనుచు నిరసించె నప్సరో
వనిత నొకఁడు.                                                                 ౩౦౧.

ఉ॥ ఒక్కని చెట్టవట్టి మఱియొక్కనికిన్ విడె మిచ్చి ముద్దు వే
ఱొక్కనికిచ్చి చల్లనిమృదూక్తుల వేఱొకనిన్ నగించి యిం
కొక్కని చెక్కుఁగొట్టి పొలుపొందె నొకచ్చరలేమ; యొక్కనిం
జిక్కుటనున్న గాదె నెలచేడెలు స్వర్గముపొంత వోయినన్.     ౩౦౨

మ॥ బలపాదాహతిరేగుధూళి దిశలన్ వ్యాపించి పై నంబర
స్థలి కేతెంచి సరోజబాంధవుని తేజంబున్ని వారించి ని
శ్చలమై రే బవ లన్నమాట లవలేశంబైన లేకుండఁ జే
సి లలద్రక్తపయోధిలోఁ బడుదుఁ దోఁచెన్ సూర్యుఁడామీఁదటన్.

క॥ అట్టియెడ వీరసేనుని, బెట్టిదమగు తూపులేసి బిట్టడఁచె జగా
జెట్టి యుధాజిత్తతఁడును, జెట్టువలెన్ గూలె సేన చెదరెన్ దిశలన్.

వ॥ మనోరమ తనతండ్రిమృతిన్ విని దుఃఖితయై.

చ॥ పతి చనిపోయెఁ దండ్రి నరపాలశిరోమణి మన్నిమిత్తమై
మృతిఁగనె నాజిలో; సుతుఁడు మేలును గీడు నెఱుంగఁగాని చి
న్నతనమువాఁడు; దిక్కెవరు నాకిటఁ! బాతకుఁడైన యాతఁ డీ
సుతుని వధించి రాజ్యమును సొమ్మును మన్మనికిఁ దలంపఁడే.     ౩౦౪

ఉ॥ పాపముఁ బుణ్య మంచుఁ దనవార లటంచును నన్యు లంచుఁ గో
పోపహతుల్ నిరస్తవినయుల్ కడులోభులునైన నార లా
హా! పరికింప నేర్తురె? భయం బెదఁ బాపి యనుగ్రహించులో
కోపకృతిస్వభావులు మహాత్ములు లిక్కడ నెవ్వ రిమ్మెయిన్!

గీ॥ మొదలనుండియు నేనన మదినిమందు, సవతి లీలావతియుఁ గృప
సలుపునొక్కొ!, శీఘ్రముగ వచ్చి యయ్యుధాజిత్తు మమ్ము, బంధ
నాగారమునఁ బడవైచు నిజము.                                           ౩౦౫

వ॥ మున్నిందు్రిండు కోపావిష్టుండై మాతృగర్భగతుం డగుబాలకుం డనవజ్రమ్మున నేడుఖండమ్ములుగా ఖండించి పిదప నయ్యేడింటి నేడేడుఖండమ్ములుగా నొనర్చిన నవి యేకోనపంచాశత్ఖండంబు లై మరుత్తులనం బరఁగె. మఱి యొకనృపకాంత తన సవతి గర్భవతియగుటకు సహింపక విషమ్ము వెట్టిన విషదగ్ధుండగుబాలకుం డుదయించె నతం డకాఁడె సగరుండు. 3౦౮

క॥ ముని దశరథభూపా లాం,గనయౌ కైకేయి తనదుగాదివిసుతు
రా, జును జేసి సవతికొడుకుఁ, వనమున కంపించె ననెడి వార్తలు
వినమే. ౩౦౯

గీ॥ అరయ నాసుతు రాజ్యమ్మునందు నిల్పు, మంత్రు లెల్ల యుధాజి
త్తుమాట కడ్డు,చెప్పలే రన్నదమ్ములు సేయఁదగిన, వారు వేర్వేరె యిం
కెట్లు వర్ణనంబు. ౩౧౦

వ॥ అని బహుప్రకారమ్ములఁ జింతించి సకలకార్యనిపుణుండగు విదల్లుం డను మంత్రివరు నేకతంబ రావించి యిట్లనియె. ౩౧౧

చ॥ తనయుఁడు చిన్ననాఁడు తగుతంత్రవిధిజ్ఞుఁడు నాదుతండ్రి యు
ద్ధనిహతుఁ డాయె మీప్రభువు ధార్మికుఁ డంతకు మున్నయంతముఁ
గనెఁ గద! శాత్రవుల్ ప్రబలి గర్వ మెలర్పఁగ మానభంగముఁ
బొనరుపనుండి రియ్యెడలఁ బోలు నుపాయ మొకం డొనర్పఁగన్.

వ॥ నావుడు మంత్రి యిట్లనియె.

క॥ చలపట్టి యుధాజి ద్ధ్యా,తలనాథుఁడు మిగుల మిమ్ము దండించు నతం
డలఘుం డియ్యెడ నిటుపై, నిలుచుట యుచితంబు గాదు నిక్కము
తల్లీ. ౩౧౩

క॥ బలవంతుండును గాకీ, తలనాథుం డెంత కేనిఁ దగు నస్మన్మా
తులుఁడు సుబాహుం డతఁడు ను, నలఁబ్రోచు నచటికి నేగ నామ
తమనినన్. ౩౧౪

వ॥ వల్లె యని యారాజపత్నియు రణనిహతుండగు తనతండ్రికి నర్హాకృత్యంబులు నెఱవేర్పంజేసి సైరంధ్రి విదల్ల సహితంబుగాఁ గుమారుం దోడ్కొని భాగీరథీతటమ్మున కరుగుటయు, ౩౧౫

ఉ॥ కూ్రిరులు చోరు లచ్చట నకుంఠితదుర్నయలీల రాత్రి య
  న్వారలఁ గొట్టి మేనఁ గలవస్తువులుం ధనముం సమస్తముం
  గారణమాత్రులై బలిమిఁ గైకొని యేగిరి ''యూరు విడ్చి పో
  ర్గారికిఁ బోయినం జలమునూనినకర్మము మాననేర్చునే. 306

వ॥ ఇట్లు చోరోపహతయై ప్రతికూల మ్మగుదైవమ్మునకు వగచుచు వస్త్రిమాతా్రివశేషంబుగ నచ్చోటుగదలి సైరంధ్రి సహాయగ నుదుపం బెక్కి గంగానదిం దాఁటి భారద్వాజాశ్రిమమ్మునకుం జని కొంత ధైర్యమ్ము చెంది యమ్మునియెదుట నిలువంబడుడు నమ్మహానుభావుండు కరుణార్ద్రిండై యామె కిట్లనియె. 307

క॥ నీవాసస్థల మెయ్యది?, నీవల్లభుఁ డెవఁడు? దుఃఖనీరధి మునుగం
  గావలసె నేమి కతమున!, దేవతవో!మర్త్యసతివొ!దెలుపుముమాకున్

వ॥ అను మునివరునకు మారాడక శోకించుచున్న విదల్లుండమ్మునివరున కిట్లనియె. 308

మ॥ ధ్రువసంధ్యాహ్వయుఁడొక్క రాజు సుజనస్తుత్యుం డయోధ్యాపురీ
  ధవుఁ డాతం డొకనాఁడు వేఁటకయి కాంతారమ్మునం గుర్విమ్మర్జిం
  గవిసెం సింగ మఖండచండిమమహాకారాతిరావడు
  ర్వ్యవసాయాతిరయప్రకృష్టభయదారంభాతిసంరంభమై. 309

వ॥ అట్టియెడ నాతండును సిఘులివియక యద్దాని కెదురై పోరెనయ్యదియు,

క॥ అక్షీణగతిని నృపహర్యక్షునిపై కుటుక నతఁ డహంకృతి వైచెం
  గాక్షేయకంబు పడఁపడి, యా క్షణమగ తాసులైరి యన్యోన్యమ్ముం

క॥ ఆతనిసతి యీసతి తను, జాతుం డీతండు వేఱుసతియును నాభూ
  నేతకుఁ గల దాపెకుఁ దను, జాతుం డొక్కరుఁడుగలఁ డసాధ్యుఁడు
  బలిమిం. 310

వ॥ ఇట్లిరువురకు రాజ్యంబుఁ బట్టంబు గట్టు పొంటె నిరువురి మాతామహులుం బోరాడి రాసమరమ్మున నీతనితాత పరేతయయ్యెఁ బిదప నీరాజపత్ని తనపుత్రునిం గాపాడుకొనగతిలేమి వనమ్మునం గ్రుమ్మరుసది పుణ్యావశమ్మున భవద్దర్శనం బొనరించె భయాతురు లగునన

దల సంరక్షణంబు కోటియజ్ఞఫలదంబని భవాదృశులకు వక్కాణింప వలయునే! యనవుడు భారద్వాజుం డమ్మనోరమ కిట్లనియె. 3_౨౩

క॥ సచ్చరితవైన నీకుఁ, వచ్చినభయమేమి? పుడమి పాలించు నిజం బిచ్చియుతపావఁ డభయం,బిచ్చితి నిచ్చోట నిలువు మిచ్చానుగతిఁ.

వ॥ అని యొక్కపర్ణకుటీరముం జూపించిన నాపెయు విడల్ల సైరంధ్రీసహితంబుగఁ గుమారుండును దానును సుఖంబుండె నట యుధాజిత్తును. 3_౨౫

ఉ॥ సంగరరంగముఁ విడిచి సైన్యసమేతముగా నయోధ్య కు ప్పొంగుచువచ్చి మంచిదగుమూర్తమునం దలశత్రుజిత్తు ను త్తుంగతరోత్సవం బెలయ దుందుభినిస్వనముల్ సెలంగ రా జ్యాంగమునందు నిల్పెఁ బురమంతయు మంగళసంగతంబుగఁ.

వ॥ అట్టియెడ ధర్మాధర్మవిచక్షణులగు కొందఱు జనంబులు.

గీ॥ అల మనోరమ యెచ్చటికరిగె నొక్కొ!,యెడ కేగె సుదర్శనుండిద్ధచరితుఁ డకట! వీరసేనుఁడు మృతుఁడై నకతనఁ,గాదె? యిటువంటి కష్టంబు కలిగె ననుచు. 3_౨౭

గీ॥ వగలఁ బొగిలియు శత్రుజిద్వశగులైన, కతన నేమియు ననక సమ్మతి గనుండి, రట్లు మన్నని రాజ్యమ్మునందు నిల్పి, యయ్యుధాజిత్తు తన పురి కరుగునెడల 3_౨౮

## యుధాజిత్తు భారద్వాజాశ్రమమ్మున కరుగుట

వ॥ సుదర్శనుండును దల్లియు భారద్వాజాశ్రమమ్మున నున్నవారని యెఱింగి యతనిం జంప నూహించి చిత్రకూటపర్వతమ్మున కరిగి నిషాదాధిపతియగుబలుఁ డనువానిం బురస్కరించుకొని శృంగిబేరపురాధిపతి యగుదుర్దర్శునికటమ్మున కేగుటయు. 3_౨౯

చ॥ విని మనమందు భీతి గడువిస్తరిలంగ మనోరమాంగనా జనతిలకంబు కన్నుల నజస్రము నశ్రులు గ్రమ్మ నమ్మునీం ద్రునిదరిఁజేరి «యీసుతుని ద్రోహమునం గడతేర్ప శత్రుజి జ్జనకిఁ దండ్రి మాకుఁ గడుశత్రుఁడు వచ్చె మునీంద్ర వింటివే.

వ॥ మున్ను పాండవులు పాంచాలీసహితులై మున్యాశ్రమమున
నున్నయెడ వారలేవురు నొక్కనాఁడు వనంబున కరుగుటయు ద్రౌపది
ధౌమ్యాదిమునులతో నాశ్రమమ్మున నుండె నయ్యవసరమ్మున. ౩౩౧

శా॥ ఆమార్గమ్మున నేగుదెంచె నెస సైన్యంబుల్ తనుంగొల్వ దు
ష్కామార్త్యుండు జయద్రథుం; డతఁడు వేడ్కన్ వేదనిర్ఘోష ము
ద్దామప్రక్రియఁ గా నొనర్చుమునులం దర్శింప నేతెంచి య
చ్చో మాద్యత్కరియానయానఁ గనె మించుంబోఁడి నాద్రౌపదిన్.

చ॥ కనుగొనినంత నెమ్మది వికారము దొట్రిల మాటిమాటి క
వ్వనజదళాక్షిపై వల పవారితమై చన ధౌమ్యుఁ గాంచి యి
ట్లను «మునివర్య! యీజలరుహానన యీతనుమధ్య యీకన
త్కనకనిభాంగి యెవ్వతెయొ! గ్రక్కున నాకెఱింగింపు నావుడున్.

క॥ పాండుతరకీర్తియుక్తుల, ఖండులు పాండవులు వారిగాదిలిసతి యీ
యండజయాన నెఱుంగవె, పాండవులన నీకుఁ గూర్చుబంధులుకారే.

గీ॥ వారలేవురు మృగయకై వనముపొంతఁ,బోయి రిప్పుడొయిఁకనోరాఁ
బోవు వార, లనిన విని సైంధవుండు నయ్యతివఁ గాంచి, యిట్టులని
పల్కె నాదరం బినుమడింప. ౩౩౫

చ॥ కుశలమె నీకుఁ బాండవులకున్! బతులెచ్చటికేగి! రెంతయున్
గృశవయి తీవరణ్యమున కేగుకతంబున; మీకు నింతదు
ర్దశ ఘటియించెఁగా! యనుచుఁ దద్దయు యోగ్యుఁడునాఁగ బల్కెఁ బం
చశరవికారదూషితుఁడు సైంధవుఁ డెక్కుడుబంధువుంబలెన్. ౩౩౬

వ॥ పడఁపడి ద్రౌపదియు బంధుసత్కారంబొనర్చె నంత
యతండును. ౩౩౭

క॥ పశువుగతి మంచిచెడ్డల, ప్రశంస విడనాడి ఋషులఁ బరికింపక దు
ర్వ్యశుఁడై హరించె నాపె వి,వశులగు దుష్టులకు వావివరుసలు గలవే.

వ॥ పిదపఁ బాండవులవలన నామె విముక్త యయ్యెనని విందుఁ
గాన నేరిని విశ్వసింపఁ దగదు. మున్ను వైరోచనసుతుండును బహుళ
యజ్ఞకర్తయు ధార్మికుండును బ్రహ్లాదపౌత్రుండు నగుబలిచక్రవర్తిని
హరి కపటవామనాకారమ్మున నింద్రహితార్థంబు గా వంచించె. ౩౩౯

ఉ॥ వామనమూర్తి లోభమున వచ్చి తనుం ద్రిపదప్రమాణ మా
భూమిని గోరినన్ గపటభూసురుఁ డంచు నెఱింగియున్ మహో
ద్దాముఁ డఖండదాత బలి దా నఖిలమ్మును ధారవోసెఁ గా
నీ మఱువుమాట వల్లఁ డతఁ డెంతటిసత్యవదాన్యుఁడో కదా. ౩౮౦

వ॥ సత్త్వగుణప్రధానుం డగుసాక్షాన్మహావిష్ణు విట్లొనరింప నిఁక నన్యులన నెంత! కావున లోభోపహతచిత్తులకుఁ జేయరానికార్యం బుండదు. ౩౮౧

మ॥ పరహింసన్ బొనరింతు రొడ్లధనముల్ ప్రాణంబులున్ గొంద్రు ము
ష్కరులై యన్యవధూరతిన్ దిరుగుచున్ గార్యం బకార్యం బటం
చరయన్నేరరు లోభు; లెయ్యెడల నన్యాయంబు లేతత్కృతుల్
పరలోకం బని భీతి చెందరు మనోవాక్కాయకర్మంబులన్. ౩౮౨

ఉ॥ దేవతలన్ యజింత్రు పరదేశములన్ జరియింత్రు దాతలై
కోవిదకోటికిన్ ముదము గొల్పుదు రుత్తము; లల్పలోభులో!
జీవుల హింససేయుదురు చేయుదు రెంతయుఁ జౌర్యమున్; దగన్
భావనసేయఁగాఁ బరధనంబు హరించెడిత్రోవ లిన్నియున్. ౩౮౩

వ॥ కావున మనయాశ్రమనికటమ్మునఁ గాచియున్న యయ్యుధాజిత్తు నవ్వలికన్పి నన్ను నిర్భయం జేసి నాపుత్రుం గాపాడుమనవుడు మునివరుండు వల్లెయని యుధాజిత్తుకడకేగి నీరాకకుం గత మేమియని యడుగుడు నతండుమనోరమానయనంబున కని నుడివె నంతమునియును

క॥ పతిశోకముఁ బితృశోకము,నతిభరమై తన్ను నేచ నాత్మజుతో న
య్యతివ మము శరణుఁజెందె వి, గతభయయై యిచటనుండి కద
లునె మరలన్. ౩౮౪

వ॥ అనవుడు యుధాజిత్తు మునిఁ కిట్లనియె.

క॥ క్రమముగ ననిపిన ననుపుము, క్రమమునకుం దక్కఁ దేనిఁ గడఁగి
బలాత్కా, రముగఁ గొనువాఁడ నిజమనఁ, గ మునివరుఁడు కనుల
నగ్ని కణములు వెడలన్. ౩౮౫

ఉ॥ ఓరిదురాత్మ! యోరికలుషోదర! యోరిజఘన్య! పో బలా
త్కారముగా గ్రహింపఁ దగుదార్ఢ్యము గల్గిన నట్లొనర్ప రా

దే! ఋషులన్న రాజులకు నెల్లిదమే? మును మావసిష్ఠుతోఁ
బోరెను గాదె ధేనువును బొందఁగ గాధిసుతుం డెఱుంగుదే. ౩౮౭

వ॥ పిదప మంతనమ్మున యుధాజిత్తు మంత్రి కిట్లనియె.

క॥ మునిపల్లులు వింటివికద!,మనోరమను సుతునితోడ మనము హరింపం
గ నుపాయమేది! రిపువృద్ధిని సైఁపఁగరాదు సూవె ధీమంతులకున్.

ఆ॥ వె॥ రాజయక్ష్మపగిది రాజన్యులకు రిపు, శేషమున్న బాధ చేయుఁగానఁ
దవిలి వీనిఁ జంపి దౌహిత్రురాజ్యంబు, విగతశత్రుకముగఁ దగ
నొసర్తు. ౩౮౯

క॥ ఇటనన్ను నెదిరికొని పోరుట కెవ్వఁడులేకయుంట రూఢియకద! యీ
జటిలునిపల్లులకుం జం, కుట యుచితమె యనుడు మంత్రి కోవిదుఁ
డనియెన్. ౩౯౦

చ॥ నరవర వింటివే! మునులనన్ మహనీయులు సాహసించు ము
ష్కరుల నొకింతలో నణఁపగాఁ గల రెందును వారు పూన దు
ష్కరమగు కార్యముండ దదిగాక మునీంద్రుఁడు "గాధిపుత్రునిన్
గరము నెఱుంగుదే" యనిన కారణమున్ విను మే వచించెదన్.

క॥ మును విశ్వామిత్రుం డను, జనవరుఁ డొక్కెడ వసిష్ఠసంయమిఁ
జూడన్, జనుటయు సమ్ముని తగునా, సన మిడి గౌరవము సలిపి
సంతస మొసఁగన్. ౩౯౨

వ॥ సైన్య సహితంబుగా విందునకు నిలువుమనుడు నతం
డట్లొనర్చె. ౩౯౩

ఉ॥ నందినియున్ వసిష్ఠమునినాయకునానతి తెప్పపాటులో
నందఱ కన్నిభంగుల ననంతములై తగుభక్ష్యభోజ్యముల్
విందు లొనర్ప సైన్యసము పేతముగా నలగాధిపుత్రుఁ డా
విందును దృప్తిగా ననుభవించె నుతించుచుఁ దన్మహత్త్వమున్.

వ॥ పిదప నమ్మునివరుని నడిగి యాధేనువుం గొనువాఁడై సవిన
యమ్మున నిట్లనియె. ౩౯౫

ఉ॥ ధేనులఁ జూడమో! మునుల దివ్యమహామహిమానుభావులం
గానమొ? యెన్నఁడేని యిటు గాంచితిమే? యొకతెప్పపాటులో

సేనలతో నృపాలురకుఁ జెచ్చెర విందులొనర్చి తృప్తులం
గా నొనరించు ధేనువులఁ గన్గొన నీమహిమంబు శక్యమే. 3౫౬

క॥ అని మెలమెల్లన నిట్లను, ననఘా! ధేనువులదశసహస్రంబులు నీ
కు నొసంగెద నా కిద్దా, నిని దయసేయఁగదె కోర్కె నెఱవేర్పఁగదే.

క॥ అనుడు వసిష్ఠుండను నో, జనవర! యెన్నేని దీనిసరిగా విదినం
దిని యనుధేనువు హోమం, బున కీక్షీరములు మాకు ముఖ్యము
లరయన్. 3౫౭

వ॥ గాన దీని నీనేరననుడు సతం డిట్లనియె.

క॥ ఈకుంటివేని యెట్లేఁ, జేకొనియెద నెల్లినేఁట సిద్ధ మనుడు నెం
తో కోపిష్ఠుఁడై వసిష్ఠుఁడు, గైకొందువుగాక చూడఁగాఁగల నేనున్.

వ॥ నావుడు విశ్వామిత్రుండు బలిష్ఠులగు భటులం బిలిచి నంది
నిం బట్టుకొనుఁడనుడు వారును నద్దాని నట్లొనర్ప భయకంపితయగుచు
నయ్యది వసిష్ఠున కిట్లనియె. 3౬౦

ఆ॥ వె॥ ఏమి తప్పుగలిగె? నేకారణంబున, నన్ను విడిచె దీ! వనయులు
భటులు, పట్టికొనఁగనేల? బాధింపఁగానేల?, యనుడు మునియు
ధేనువునకు ననియె. 3౬౧

మ॥ బలవంతుం డగురాజు దుర్నయముసం బాధించుచున్నాఁడు నేఁ
గలకార్యంబు మఱేమి? నిన్ను విడువంగా నోప నాశక్తికిం
దలదాఁటెన్ దపమేడ! యుద్ధమునకుం దార్కొలు తానేడ! నీ
తలమైనన్ విడిపించుకొమ్ము ననువొందన్ రమ్ము మున్మాటికిన్. 3౬౨

మ॥ అని మౌనీంద్రుఁడు వల్క నందినియుఁ గ్రోధావేశ మొప్పార హు
మ్మను నాలోనన రాక్షసుల్ ప్రబలదర్పాహంకృతుల్ మీఱఁ ద
ద్ఘన కాయమ్మునఁ బుట్టి నిల్వుమని తత్సైన్యంబు వారించి గ్రి
క్కునఁ గాఁ జేసిన నెట్టులో మిగిలెఁ దత్క్షోణీశ్వరుం డొక్కఁడున్.

ఉ॥ అంతయుఁ గాంచి నెమ్మనమునం దతిభీతియు సంతసంబునుం
జింతయుఁ దొట్రిలంగఁ గడు సిగ్గిలి సీ! నృపపౌరుషంబు గో
రంతయుఁ గాదు బ్రాహ్మణతపోధిక తాధిగతప్రతాప మిం
తింతఁగ నొప్పునే! ముని జయించుట కేమియుపాయ మిత్తఱిన్.

మ॥ అని దీర్ఘం బగుచింత నెమ్మనమునం బావిర్భవింపన్ ధిగం
చును క్షాత్రింబును ధిక్కరించి తప మస్తోకంబుగాఁ జేసి వా
రని కిన్కం ద్విజుఁడై మునీంద్రుఁడగుచున్ బ్రహ్మర్షియంతయ్యు న
మ్మునికిం జాలకపోయె * బ్రాహ్మణులతోఁ బోరాడుటల్ మాటలే.

క॥ కులనాశకరంబగు వి, ప్రులతో వైరంబు గాన భూవర! మనమున్
జలపట్టి క్రొవ్వితోడన్, దలఁగోకక్రొనకయ చనఁగఁదగుమనపురికిన్.

ఉ॥ దీనుఁడు నిర్ధనుండు గతతేజుఁడు బాలుఁడు తోడు లేద
రణ్యాని వసించువాఁ డనద నాఁదగువాఁడు సుదర్శనుండు నీ
పై నెటు రాగలాఁ డటులు వచ్చినఁ జూడఁగ వచ్చుఁ గాని యీ
మానివ రేణ్యునిం జెనకి మానముఁ బ్రాణముఁ గోలుపోకుమీ. ౩౬౭

ఆ॥ వె॥ తృణము వజ్ర మగును వృణమగువజ్రంబు, దోమ యేన్గుగున్నతో
నెదురు్చు, శశకమైనఁగాని శార్దూలమును జంపు, దైవయోగ
మొకటి దప్పెనేని.                ౩౬౮

క॥ కాఁదగినది కాకుండదు, కాఁ దగనిది కాదు దైవకారణమున నా
మోదము ఖేదముఁ దుల్య, ప్రాదుర్భావమ్ము లిందు వగవరు తజ్జ్ఞుల్.

వ॥ అను మంత్రివచనమ్ములకు సమ్మతించి మునీంద్రుపాలికిం జని నమస్కరించి నానేరమిస్సైఁపుమని వేఁడుకొని యనుజ్ఞాతుండై యుధాజిత్తు తనపురమ్మున కరిగె నంత మనోరమయు స్వస్థచిత్తయగుచు నయ్యాశ్రిమమ్మున నుండె శుక్లపక్షచంద్రుం బలె దినదినప్రవర్ధమానుండగుసుదర్శనుండు సవయస్కులగు ఋషిపుత్రులతోడం గ్రీడించు వాఁడొక్కనాఁడు విదల్లుం గుఱిచి మునిపుత్రుం డొకఁడు క్లీబయని యామంత్రించుటయు.

## సుదర్శనునకు కామబీజప్రాప్తి

క॥ విని యందు నాదివర్ణము, ననువుగ బిందువునుగూర్చి యనుదినముఁ
బఠిం, చెను భావిభాగ్య వశమునఁ, జనె నొక యైదేడులిట్లు జననాథమణీ

ఉ॥ న్యాసముఁ సున్న ఛందమునునట్టిది లేదుఁక ధ్యానమన్న స
న్న్యాసము సర్వశూన్యముగ నాతఁ డదృష్ట మహోదయమ్మునన్

* తాపసులతో

జేసి మనమ్మునన్ నిలిపి శ్రీకరమై తగు కామబీజ ను
ఛ్యాసము చేసె నెన్నటికినైనను విస్మృతిఁ జెందకుండఁగన్. 321

గీ॥ అంత నేకాదశాబ్దంబునందు నుపన, యనము గావించి ముని వేద
మభ్యసింపఁ, జేసె నారాజసుతుఁడు సుశ్రీవహించె,వేదమున శాస్త్రి
మున ధనుర్వేదమందు. 323

మ॥ ఒకనాఁ డంబిక రక్తవర్ణయును రక్తోద్యద్విభూషాంబరా
దిక బాభాసురచారుగాత్రయును నై దివ్యస్వరూపంబుతో
నకలంకుం డగునాసుదర్శనునిపై సత్యాదృతస్వాంత యై
సుకృతంపుంగని యై ఖగేశరథయై చూపట్టెఁ బ్రత్యక్ష మై. 324

ఆ॥ వె॥ ఆసుదర్శనుండు నాయంబ నైష్ణవిఁ, గాంచి మ్రొక్కి భక్తి గడ
లుకొనఁగ, సేవసేయుటయు దయానతి యాతల్లి, శరశరాస
నాదిసకల మొసఁగె. 325

గీ॥ శరశరాసనకవచముల్ శరధియుగళ, మాదిగాఁగొని దేవీకృపామృ
తమున, కాటపట్టయి మిగులఁ బ్రఖ్యాతి నెసఁగి, యతఁడు నవమన్మ
థుండయి యలరునంత. 326

శా॥ కాశీరాజతనూజ రూపమునకుం గాణాచి విద్యావయః
ప్రాశస్త్యంబుల కెల్ల మొల్లమునకుం బ్రాణంబు బల్చాతురీ
సౌశీల్యంబులపోవు నాశశికలాశ్యామాశిరోరత్న మ
య్యాశానాప్తతనూజతుల్యు విని వందిద్వ్యప్రభావాస్పదున్. 327

చ॥ విని తదధీనచిత్తయయి వేఁగుచు వేకువ నొక్కనాఁడు చ
య్యనఁ గనుమోడ్చునంత జగదంబ ముదంబున స్వప్నమందుఁ బే
ర్మినిఁ బొడసూపి యిట్లను ౹౹వరింపుము నిన్ను సుదర్శనుండు నై
కొనుఁ గనకాంగి! నీదయినకోర్కె ఫలించు నవంచితంబుగన్. 328

క॥ అని పలికి చనియె నంతట, వనజాక్షియు మేలుకాంచి స్వప్నము
తనచిం, తనమున కనుగుణమగుటకు,మనముబ్బఁగ మోము మాటి
మాటికిఁ జెలఁగన్. 329

వ॥ హర్షనీరధి మునుంగుడుఁ దల్లి యిందుల కేమికారణం
బనవుడు సిగ్గునఁ దలవంచె. 330

ఉ॥ పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మి నొకించుక చెప్పరాదె! మీ
యమ్మకుఁ జెప్ప వంచును రహస్యమునన్ దను మాటిమాటికిన్
గ్రమ్మిన రాత్రి స్వప్నమునఁ గల్గినముచ్చట లచ్చుగాఁగ న
క్కొమ్మ వచించె నెచ్చెలులకున్ వినరానిరహస్య ముండునే. ౩౮౧

ఉ॥ అంత వసంతమందుఁ జిగురాకులచేఁ బొగ రెక్కి కోయిలల్
అంతులు సేయఁ జుమ్మనుచు నంపిలి తుమ్మెద నిమ్మరిండ్లు బల్
గంతులు వేయ నాశశికలాలలితాంగి సఖీసమేత యై
కంతునికిన్ నివాస మనఁగాఁ దగుపుష్పవనమ్మునం దొగిన్. ౩౮౨

క॥ బహుఫలభరితసుసుమఘనా, ర్వ్యూహపల్లవలితలలితపాదపవల్లీ
విహృతి మెయిఁ బ్రొద్దుపుచ్చుచు నహస్పతిసమాను నొక్కయగ్రజుఁ
గనియెన్. ౩౮౩

చ॥ కని వినయమ్మునం జరణకంజములం బడి మ్రొక్కి యిట్లనున్
వనజభవావతార! తమవాస మదెక్కడ! నేడనుండి యి
వ్వని కరుదెంచిరో! తమకు వచ్చిన కారణమేమొ! పేర్మి నె
క్కొన వచియింపుఁ డా! యనుడుఁ గోమలికిన్ ద్విజవర్యుఁ డిట్లనున్.

శా॥ భారద్వాజమునీంద్రునాశ్రమము మద్వాసంబు కార్యార్థినై
దూరం బేగుచు నుంటి నావలన నెంతో కార్య మున్నట్లు న
న్నారాధించి ప్రశంసఁ జేసితివి నీయాంతర్యమున్ దెల్పి నీ
వేరాజన్యుని పుత్త్రివో! నుడువుమా! యిందిందిరాభాలకా. ౩౮౪

వ॥ అనవిప్రకుమారున కక్కోమలి యిట్లను మహాత్మా! యేను గాశిరాజకుమారిత శశికల యనుదానఁ దమరు పూజ్యు లగుటం జేసియు భవద్దేశమందలివిశేషమ్ములు వినఁ గోరియుఁ బ్రశంసించితి భవదాశ్రమమ్మునం గలచక్కనియొక్క విశేషంబు వక్కాణింపుఁ డన నక్కమలాక్షి కతం డిట్లనియె. ౩౮౫

క॥ కలఁడు ధ్రువసింధుఁ డను భూ, తలపతి యానృపసుతుఁడు సుదర్శ
నుఁడను వాఁ, డలఘుఁడు మాయాశ్రమమునఁ, గలఁ డాతం డెంత
కేనిఁ గలఁడు కుమారీ! ౩౮౬

ఉ॥ అంబురుహాక్షి! యాతఁడు గుణాలయుఁ డాకృతిపంచబాణుఁ డా
యంబకు భక్తుఁ డెంతయు నయంబునఁ బొల్చెడిముద్దులాఁడు వా
నిం బలె నొప్పువేఱొకరునిన్ గనఁ బోము మఱేమి! బ్రహ్మ నీ
కుం బనిఁ బూని చేసె ననుకొందు నినుం గని సుందరీమణీ! ౩౮౮

క॥ పూవుం దావియుఁ గొమ్మయుఁ, జేవయు బంగారు మణియుఁ జేర్చిన
విధి యో, పూవుంబోఁడిరో! నీ కా, భూవరమన్మథునిఁ బొందు పొసఁగిం
పఁడొకో. ౩౮౯

క॥ అనుభూసురవచనములకు, మన మలరఁగ మోము మందమందరుచి
రహా, సనియతిఁ బొదల శరీరం, బునఁ బులకలు వొడమ నొప్పెఁ
బూఁబోఁడి వెసన్. ౩౯౦

గీ॥ భూసురుం డేగె నంత నాభాసురాంగి, పూర్వమునకన్న ననురాగ
మును వహించి, చచ్చి చావని వానిబల్ హెచ్చునకు సహింప నేరక
చెలిమిన న్నిట్టులనియె. ౩౯౧

చ॥ చెలియరో! యేమనోహరుని చెల్వము విన్నది యాదిగాఁగఁ జం
చలతయు బల్ వికారము విచారముఁ దోరముగా నెసంగు న
చ్చెలువుఁ డెవండొ? గోత్రమును జెయ్వులు దేశముఁ దల్లిదండ్రులుం
గులము నెఱుంగ రా దెటులొకో! యిటు మన్మథుఁ డార్తి వెట్టినన్.

చ॥ కలఁ గనుఁగొంటి నాతనివికాసము హాసము భాసమానని
స్తులతరహావభావములు సుందరి! యేమని చెప్పుదాన నా
కొలఁదియదృష్టహీనలకుఁ గోరినఁ బైఁబడి మ్రొక్కి వేఁడినన్
గలుఁగునె? యట్టివాఁడు కలఁ గన్నదియే యొకలాభ మంగనా.

సీ॥ చందనంబు విషంబు చందంబుగాఁ దోఁచుఁ బూలమాలిక పాము
పోల్కె నుండు, వెన్నెల నిప్పులకన్న వేఁడిమి చూపు హర్మ్యంబు
యమకూప మనఁగవచ్చు, పూసెజ్జ కత్తులబోనుగాఁ గనుపట్టు రా
తిరి మృత్యువురాణ నెసఁగుఁ, బగలన్నఁ బగవానిపగిది బీరము
చూపు గీతాదికంబన్న భీతి పుట్టు; గీ॥ విడె మడలుగొల్పు పూఁ
దోఁట వెట్టఁజేయుఁ, జెలులపైఁ గోప మొదవుఁ జాపలము హెచ్చుఁ
దల్లిదండ్రులకిది చెప్పఁ దప్పు చెప్ప,కున్న నేగతినబ్బునవ్వెన్నెలాఁడు.

మ॥ అనురాగం బది కన్నుగానదు మనంబా! మిత్త్రుపల్లమ్ములన్
గన కెచ్చోటకునైన నేగు నిఁక వేడ్కల్ మంచియుం జెడ్డయున్
మునుపే నేరవు మన్మథుండు చపలాత్ముం డెంతయున్ మూర్ఖుఁ డం
గనలన్ లోఁకువఁజేసి మీఁదఁబడు శక్యంబే! నివారింపఁగన్. ३८९

మ॥ మదనుం దిట్టఁగ రాదు కోయిలలతో మా ఱొడ్డఁగా రాదు నె
మ్మది వారింపఁగ రాదు కోర్కెలపసన్ మర్దింపఁగా రాదు దు
ర్మదమున్ గ్రిందుగఁ జేయ రాదు తనకామం బన్యు లౌవారితో
మొదలే చెప్పఁగ రాదు కష్టమకదా! పూఁబోఁడివై పుట్టుటల్.

క॥ కులకాంతనైనకతనం, గలుగదు స్వాతంత్ర్య మేమిగానున్నదొ! నె
చ్చెలి! వెలవెలదుఁక లేనో,ములునోఁచిరొ! వెఱ్ఱిమాటపోనీఁగదవే.

ఉ॥ ఆతఁడు రాజ్యహీనుఁడు వనాంతరవాసియు నంచు వింటిఁ బ్రి
ఖ్యాతులు రాజ్యసంపద లఖండముగాఁ గలరాజపుత్త్రు లీ
భూతలమందు లేరొ! ననుబోటికి వారలు తగ్గవారు కా
రో! తరుణీ! యదేమొ యతఁ డొక్కఁడ నామదిఁ జిక్కి సొక్కెడున్.

క॥ ఆనృపుఁ డుండినయెడ నా,కానతి యిడె నొక్కవిప్రుఁ డట కేగుటకున్
మానసము తొట్రువడు న,వ్వానికి నావంతఁ దెల్పువా రెవ్వరొకో.

చ॥ అలరెడివేడ్కఁ దండ్రియు స్వయంవరముం బొనరింపఁ డాయె నె
చ్చెలు లొకరైన బిట్టెనయుచింత నడంపఁగఁ జాలరైరి నా
కలఁ గనుపట్టి చెప్పినజగత్ప్రసు వాపరదేవియైన బా
ము లెసఁగఁజేయు నాకుఁగలమోహము మేర యెఱుంగ దక్కటా!

వ॥ ఇట్లు తదధీనచిత్తయై యక్కన్నెమిన్న యుండె, నట సుదర్శ
నుండు స్వప్నాద్యవస్థలఁ దన్మహామాయాసందర్శనం బొనర్చుచుఁ దదే
కధ్యానపరాయణుండై కాలమ్ముఁ బుచ్చుచుండె నతనికడ కొక్కనాఁడు
శృంగిబేరపురాధ్యక్షుం డగునొకనిషాదపతి యేతెంచి సర్వోపస్కరయు
తంబును జతుస్తురగయుక్తంబును బతాకాదిశోభితంబును నగునొక్క
రథం బుపాయనంబుగా నొసంగిన మిత్త్రభావమ్మునం గారవించి య
య్యది గైకొనియె. నట్టియెడ, ४०१

క॥ భారద్వాజాశ్రమగతు,లై రాజిలుమునులు పల్లి రాతనిఁ గని యో
వీరాగ్రేసర! యిఁక భూ,భారధురంధరుఁడవగుచుఁ బ్రబలెదవుకడున్.

ఉ॥ ఏపర దేవతామహిమ మించుక గల్గినవారు పాపముల్
తాపము లాపదల్ గడచి ధన్యులు మాన్యులునై జగజ్జయ
వ్యాపృతులై చెలంగెదరొ! భద్రవిధాయిని యామె ముఖ్యమా
హాత్మ్యక మట్టిసీకు దురవాపము గల్గునె? ముజ్జగమ్ములన్. ౪౦౩
వ॥ అని మనోరమం గాంచి.

క॥ ఓవీరమాత! విను పా, రావారపరీత మహామహారాజ్యశ్రీ
కేవల దేవీకృపకున్, దావల మగునీకుమారునకు సంధిల్లున్. ౪౦౪

చ॥ అనినమనోరమాసతియు నట్టులె మీవచనంబు నిక్క మా
ననఘచరిత్రులార! యొకఁ డైన సహాయము లేనినాతనూ
జున కెటు రాజ్యభార మది చొప్పడుఁ దప్పునె? మీనుడుల్! మహా
జను లగువారిదీవనలె సర్వము నిర్వహణం బొనర్చెడిన్. ౪౦౫

క॥ ఈదశదిశ లోకములైనను, మేదిని రజమైన జలధి మిత్తైన నగున్
భూదేవత లిడునాశీ,ర్వాదములకుఁ దిరుగు లే దవార్యము లగుటన్.

క॥ అని నెమ్మది యుబ్బఁగ సూ, నునిసేమముఁ గోరి యామనోరమ
యుండెన్, ఘనుఁడు సుదర్శనుఁడు జగ, జ్జననికటాక్షంబు తనకు
సంతస మొసఁగన్. ౪౦౭

ఆ॥ వె॥ ఆరథంబు నెక్కి యలరెడి వేడ్క, నెందేనిఁ జనెడివేళఁ గానుపించు
నక్షమై తనర్చు నక్షౌహిణీసైన్య,మధ్యమం దెలర్చు మహిపుమాడ్కి

ఉ॥ శోభనదాయి యై సకలశోకవినాశక మైన కామరా
జాభిధబీజమున్ గురుదయావశతన్ దగ సంగ్రహించి శ్ర
ద్ధాభరితంబుగా నెవఁడు తద్దయుఁ దజ్జప మాచరించు వాఁ
డాభగవత్యనుగ్రహము నంది పురందరసన్నిభుం డగున్. ౪౦౯

సీ॥ అంబార్చనాసక్తు లగువారలకుఁ గలుగనిశుభమ్ములు లేవు కావర
మున, నెవ్వ రంబార్చన నీసడింతురొ? వారు మాతృకాద్రోహులు
మందమతులు, దుష్టులు రోగులు దుఃఖపీడితులును గా నెఱుంగుము

దేవమాననీయ, వై యాదిశక్తి వై యమరునాయంబయే యఖిల
జీవులయందు నలరుచుండు; గీ॥ బుద్ధి ధృతి కీర్తి లక్ష్మిసమృద్ధి శక్తి,
శ్రద్ధ స్మృతి లోనుగాఁ గలసకల మగుచు, నామె నెఱుఁగనివారల
యజ్ఞు లనఁగ, నెఱుఁగువారల పండితు లెఱుఁగు మధిప. ౪౧౦

ఉ॥ బ్రహ్మ మొదల్ పిపీలికలు పారముగాఁ గలజీవసంతతుల్
బ్రహ్మవచోభిధేయము నపార మనాద్య మమేయ మహాపర
బ్రహ్మము గాఁగ నేపరమపావని నేజగదంబఁ గొల్తు రా
బ్రహ్మముఁ దా నెఱింగె నొకపాటియనం దగునే? సుదర్శనుల్.

శా॥ దేవారాధితయై మహామహిమయై దివ్యస్వరూపాఢ్య వి
ద్యావిద్యాకృతియై జగం బఖిలముల్ వ్యాకీర్ణముల్ జేసి స
ద్భావాతీతుఁ బురాణపూరుషుని సంభావించు నేదేవి యా
దేవిన్ గొల్చి సుదర్శనుండు సుఖ మందెన్ రాజ్యముల్ బాసియున్.

క॥ శశికలయు నాసుదర్శన,వశగతహృదయయయి వలపు వర్ధిల్లఁ బాఱన్
గృశ యయి భృశచింతనయై, యశనాయాదికము మఱచె నధిప
వతంసా. ౪౧౩

చ॥ శ్రమి రెవిచారణాంశమును గొంత యెఱింగి సుబాహుఁ డావెతం
డ్రి మురువుమీఱఁ బుత్రిపయి నెమ్మి దలిర్ప స్వయంవరం బొన
ర్ప మదిఁ దలంచి యెల్లనరపాలురకున్ దెలియంగఁ జేసె న్యా
యమకద! రాజపుత్రిలు స్వయంవరమందు వివాహ మాడుటల్.

వ॥ స్వయంవరమ్మును నిచ్ఛాస్వయంవరంబు పణస్వయంవరము
శుల్కస్వయంవరము నా మూడు తెఱఁగు లందు శ్రీరాముఁడు శివధ
నుర్భంగం బొనర్చి సీతం గైకొన్నది పణస్వయంవరంబు తక్కుఁగలరెం
డును బ్రసిద్ధమ్ము లందాద్యమగునిచ్ఛాస్వయంవరంబు చాటం బంపుడు.

ఉ॥ మాళవచోళమద్రవరమాగధవంగకళింగసింధుబం
గాళకగూర్జరలాటకురుకాశమరాటవరాటగౌళనే
పాళవిదర్భబర్బరనృపాలకుమారకు లాసుబాహుభూ
పాలునిపట్టణంబునకు వచ్చి రనేకు లుదంచితస్థితిన్. ౪౧౬

వ॥ అంతకు మున్న యన్నళినాక్షి తద్వృత్తాంతం బెఱింగి సఖిం గాంచి కుంచితాస్యయై కనుఁగొనల నశ్రు లురుల మంతనంబున నిట్లనియె.

ఉ॥ నెచ్చెలి! నామదిం గలుగు నెవ్వగ నెవ్వగ నాఁపికొందు? నా
నచ్చిన చెల్మికాఁడు జననాథశిరోమణి నాఁటిరాత్రి భూ
భృచ్ఛయ రాజపుత్రి కడుఁ బేరిమి నాకిడినట్టికోర్కె యు
ద్యచ్చరితుండు నైతగు సుదర్శనుఁ దక్క నొరున్ వరింతునే. ౪౧౮

మ॥ ధనముల్ కాల్పనె? రాజ్యసంపదలు కాంతారమ్మునన్ జేర్పనే?
గొన మందంబును జాతుకీగరిమయున్ గూలంకషప్రజ్ఞ యె
వ్వనికిం జొప్పడు వానిఁ గోరదగు నవ్వాఁడెన్నఁగా నాసుద
ర్శనుఁడే యింతకు నొక్కకంఠోక తెరువున్ జక్కంగఁ గన్పట్టెడిన్.

క॥ అని త్రిప్పరాని పేర్మినిఁ, దనతోడం బల్కు రాజతనయవచనముల్
పనిగొని జననికిఁ దెల్పఁగఁ, జనియా వైదర్భితోడ సఖి యిట్లనియెన్.

వ॥ అమ్మా! మన శశికల సుదర్శనుండను రాజపుత్రుం దక్క నన్యుని వరింపనని నిశ్చయించుకొని యున్నయది. ౪౨౧

క॥ భారద్వాజాశ్రమమున, నారాజ తనూజు వాసమఁట! యాతనికిన్
ధారాళముగఁ ద్రిశుద్ధిగ, ధారాదత్తంబు జేసెఁ దన నెమ్మనమున్.

వ॥ అనుడు వైదర్భియు నయ్యుదంతంబు తన పతికెఱింగించిన నతం డమ్మగువ కిట్లనియె. ౪౨౩

ఉ॥ వాని నెఱుంగుదే చెలియ! వాఁడన; రాజ్యము గోలుపోయి య
న్నానకు లేక కాననమునన్ మునిపల్లె వసించుఁ దల్లితోఁ
బూని యుధాజిదాహ్వయుఁడు పోరునఁ జంపెను వీరసేను న
వ్వానికతమ్మునన్ గడు నభాగ్యుఁడు వానికిఁ బుత్రి నిత్తునే. ౪౨౪

క॥ కావున నచ్చఁగఁ జెప్పుము, నీవేగి తనూజ కిపు డనింద్యచరిత్రుల్
కోవిదులు భాగ్యవంతులు, వేవేలు స్వయంవరమున విడిసిరి నృపతుల్

వ॥ అని భర్త పల్కిన వల్లెయని యావైదర్భి పుత్రికడ కరిగి బుజ్జగించి శిరమ్ము మూర్కొని తొడపై నిడుకొని యల్లన నిట్లనియె.

మ॥ ఫలమూలాశి వనప్రవాసి కృశుఁడున్ బంధుప్రజత్యక్తుఁడున్
బలకోశాదివియుక్తుఁ డెంతయును నిర్భాగ్యుం డతం డున్నతుల్

కలవా రూర్జితు లార్జితోత్కటయశః ఖ్యాతుల్ నరేంద్రాత్మజుల్
దలఁప న్నీకయి వచ్చి రందఱును సౌందర్యమ్ము నన్ మన్మథుల్. ౭౨౮

తరల॥ అల సుదర్శను తమ్ముఁడున్ గడునందగాఁడు మహాబలుం
డలఘుఁ డాతఁడు శత్రుజిత్తు ధరాధిపత్యము గల్గు వాఁ
డెలమి నీకనుకూలుఁడై తగు నేతదర్థమకాదె తాఁ
గలన నీతనితాత చంపెఁ బరగ్ గళింగధరాధిపున్. ౭౨౯

క॥ అదియునుగాక యుధాజి,త్తదనగునెడ నితనిఁ జంపు నాకతముననే
కద!భారద్వాజునికడ, సుదర్శనుండుండు టరయ సుదతీ! వినుమా.

క॥ నీతండ్రి సుదర్శనున క, పేతవిభవుఁడనుచు నిన్నుఁ బెండిలిసేయన్
జేతోగతి వాంఛింపం,డాతలఁపిఁక విడిచి పెట్టుమమ్మ కుమారీ. ౭౩౦

వ॥ అనుడు నక్కోమలి తల్లి కిట్లనియె.

చ॥ వనమున నుండుఁగా కతఁడు పట్టణమందు వసించుఁగాక ని
ర్ధనుఁడగుఁగాక మేటిధనధాన్యములం దులఁదూఁగుఁగాక నా
మన సలవానిఁ దక్క పెఱమానిసి నొల్లదు ధాతయైన ఫా
లనిహితమైనవ్రాఁతలకు లాఁతిగతుల్ పొసగింపనేర్చునే. ౭౩౧

క॥ శర్యాతి వచనమున మును, నార్య సుకన్యాభిధాన చ్యవనుని గొనిన
ట్లార్యావచనమ్మున శుభ, చర్య సుదర్శను వరింతు సత్యవ్రతనై. ౭౩౨

క॥ కైతవ మెఱుఁగక భర్తకుఁ, జేతోమోదమున సేవఁ జేసెడిసతికిన్
శ్రీతియు స్వర్గముమోక్షువి, భూతియునుంగలుగునిక్కమగునోతల్లీ

క॥ మచ్చిత్తభిత్తి భగవతి, విచ్చలవిడివ్రాసె వానివిధమంతయు నా
నచ్చినవాఁడతఁడొక్కడ,హెచ్చుములేదిందుఁగూర్చి పొసఁగ నతనిప్పై.

క॥ అని శశికల వివిధ నిద, ర్శనములు చూపించి తనకురమ్యుండు సుద
ర్శనుఁ డొక్కఁడ యని చెప్పిన, జననియుఁ బతి కెఱుఁగఁజేసెఁ
జని సకలంబున్. ౭౩౫

వ॥ అంత స్వయంవర మహోత్సవం బాసన్నం బగుడు శశికల సుదర్శనురామికిఁ జింతించి యత్యాప్తుండగు నొక్క విప్రునిం బిలిపించి రహస్యమ్ముగ నిట్లను నోయయ్యా! మాయయ్య యెఱుంగకుండ భారద్వాజాశ్రమమ్మున కరిగి సుదర్శనుంగాంచి నావచనమ్ములుగా నిట్లనుము.

ఉ॥ అంబ నినున్ వరింపుమని యానతి నాకిడె నామనంబు స
త్యంబుగఁ జిక్కె నీపయి స్వయంవరమా నికఁ నెల్లి; రాజసం
ఘంబు పురంబునన్ విడిసెఁ గాని త్వదాగమనంబు లేదు న్యా
యంబె యనాదరంబు విషమాంబకదర్శన యోసుదర్శనా. ౧౩౯

ఉ॥ నే నినుఁ దక్క నన్యుని గణింప వరింప మదిం దలంప నా
మేను నిజంబు నీయదిసుమీ వినుమీ? నను మాని తేసి నీ
గానమి వహ్నిలోఁ బడుదుఁ గాని యెడన్ విషమాహరింతుఁ బ్రా
ణానకు వెక్కఁ జూతు నని లోఁ దలపోయకు ప్రాణవల్లభా. ౧౪౦

చ॥ మనకుఁ బరాంబికాకృప సమస్తశుభమ్ములు గల్గు దైవమున్
మనమున నమ్మి రావలెఁ జుమా! శివకేశవముఖ్యు లేజగ
జ్జననికి వశ్యు లాజనని సత్యము దప్పనితల్లి యాపె వా
క్కును వితయానె నాథ! కయికొమ్ము ననుంబ్రతికించి పుణ్యమున్

చ॥ అని వచియింపు మానరవరాగ్రణి కిట్టులె యంచు శాస్త్రిమా
యనఘ! సమస్తమున్ దెలిసినట్టిమహాత్ముఁడ వీవు కార్య మే
యనువునఁ జక్కనౌనొ యటు లాతనితో వచియించి పున్నెమున్
గొనుము పరోపకారమునకున్ సమమైన విశేషమున్న దే. ౧౪౨

ఉ॥ అక్కరుణాకరున్ గడురహస్యమునం గను మట్లు కాంచి నా
చక్కఁదనం బొకింత సరసంబుగఁ జెప్పుము చెప్పి నాదుపె
న్మక్కువ మేరలేని దని మాటికిఁ దెల్పుము చేతు లెత్తి నే
మ్రొక్కితి నంచుఁ బల్కు మిఁక ముంచినఁ దేల్చిన నీవ నావుడున్

వ॥ తద్దత్తంబగు దక్షిణన్ గ్రహించి యాతండును సుదర్శను
కడకేగి సకలమ్మును వచియించి యతనిచే స్వయంవరమ్మున కేతెంచెద న
నియనిపించుకొని తత్క్షణమ వచ్చి యక్కన్నెతో నంతయు నుడివె నట.
సుదర్శనుండు స్వయంవరగమనోన్ముఖుండగుటయు. ౧౪౪

క॥ తల్లి మనోరమ శోకం,బుల్లమ్మునఁ గడలుకొనఁగ నొగి గుండియలున్
జల్లన నల్లన నశ్రులు, వెల్లివిరియఁ బల్కె నిట్లు విహ్వలమతియై.

చ॥ పలువురు రాజు లున్నెడకు బాసట లేకయ పోఁ దలంచె ద
ప్పలుగ యుధాజిదాఖ్యుఁ డతివైరి నినుం గడ తేర్ప నెంచి తా

నలమెడ కేగుదెంచు నను నాత్మజశోకపరీతఁ జేయఁగాఁ
దలఁపకుమయ్య! నాపలుకు దబ్బఱసేయకుమయ్య నావుడున్.
ఉ॥ అంబికయానతిన్ శిరమునం దిడి యేగెడి నాకు నెందు! న
ష్టం బొకడుండునే? యొరులధాకకుఁ జంకుదునే? మదంబ! శో
కం బుచితంబె క్షత్రియకుఁ! గాఁదగుకార్యము కాకపోదు దుః
ఖంబును సౌఖ్యముం జగతిఁ గావడికుండలు ప్రాణికోటికిన్.

వ॥ అని తల్లికి ధైర్యంబు చెప్పి నిషాదదత్తం బగురథం బధి ష్ఠించి చన నుద్యుక్తుం డగుకుమారుంగాంచి మనోరమ యిట్లను నో యన్నా! విజయార్థం బేగెడి నిన్ను నగ్రమ్మున నంబికయు వెనుకఁ బార్వతియు విషమమార్గమ్ముల వారాహియు దుర్గమ్ముల దుర్గయు ఘోరకలహమ్ములఁ బరమేశ్వరి యగుకాళికయు స్వయంవరమ్మున సౌమ్యాయగు మాతంగియు భూపమధ్యమ్మున భవానియు గిరిదుర్గంబుల గిరిజయుఁ జత్వరమ్ములఁ జాముండయుఁ గాననముల సనాతని యగుకామగయు వివాదమ్ముల వైష్ణవియు శత్రుసమాగమమ్మున భైరవియు సర్వదేశంబుల జగద్ధాత్రియగు భువనేశ్వరియుఁ గంటికి ఱెప్పచందమ్మున రక్షింతురు గాత మని దీవించి మఱియును, ౭౭౮

శా॥ అన్నా! నిన్నెడనాడి యిన్నెడ క్షణంబైనన్ వసింపంగఁ జా
ల న్నిన్నున్ గనులారఁ గాంచికద! కాలంబెల్ల హేలాగతి
న్బ్రాణంబుగఁ బుచ్చుచుందు నదియున్ విఘ్నంబుగావింప నీ
కు న్యాయంబె? రథంబుపైనిడి ననుం గొంపొమ్ము నీతోడుతన్.

వ॥ సుదర్శనుండు వల్లెయని ధాత్రేయీసహితంబుగఁ దల్లిని రథం బెక్కించుకొని శీఘ్రగమనమ్మునఁ గాశీపురమ్ము చేరిన సుబాహుం డెదుర్కొని తగినవిడిది యొసంగి యుపచారమ్మునకుఁ దగువారి నియోగించె దౌహిత్రసహితుం డగుయుధాజిత్తును దక్షుఁగలరాజన్యులును సుదర్శనుంగాంచి తమలో నిట్లు ప్రశంసించుకొనిరి. ౭౭౯

## ≫ సుదర్శనుండు స్వయంవరమున కేగుట ≪

ఉ॥ తా నిట కేగుదెంచెను సుదర్శనుడుం దగువానిభంగి రా
ట్సూనుల రాజరాజసుతసుందరు లందఱినిం ద్యజించి త

న్నీనళినాక్షి కోరుననియే మనమందుఁ దలంపఁ బోలు నే
మో! నగినట్టియూళ్ళు లగు నొక్కెడఁ బట్టణముల్ గ్రమమ్ముగన్.

క॥ అనిన యుధాజిత్తిట్లనుఁ, గనుఁడీ! మీరెల్ల నాదుకడిమి నిట సుద
ర్శనుఁ గడతేర్చెద ననవుడుఁ,బనిఁగొని యనుఁ గేరళాధిపతియా
తనికిన్. ౮౫౨

మ॥ ఇది యిచ్ఛావరణార్థ మేర్పడియె నయ్యేణాక్షి యిందొక్కరున్
మది కింపై తగువాని సంగభవుసామ్రాజ్యమ్మునం గూర్చు న
య్యది తక్కంగలయస్మదాదుల కవార్యం బట్లు కాదేని దు
ర్మదు లీరాజులటందు రెల్లరును మర్యాదావినాశంబుగన్. ౮౫౩

చ॥ అది యటులుంచు న్యాయ్య మగు నాతనిరాజ్యము దుర్నయమ్మునన్
మొదల హరించి యిచ్చితివి మద్దులమన్మని; కాతనిన్ వరిం
పఁదగదె? యీసుదర్శనుఁడె పట్టముఁగట్టెనె! బేలరీతి నె
మ్మది నిటు కుందనేల వినుమా! యితఁడే నినుఁ జక్కఁ జేసెడిన్.

క॥ విను మెన్నఁడేని ధర్మమ్మునకున్ జయమబ్బు సత్యమునకగు వృద్ధుల్
చనకుముదార్యమునకు,ఘనుఁడందటి నేలువాఁడుగలఁడో! లేఁడో!

ఉ॥ అందఱినిన్ వరింపదు కదా! యొకరాజతనూజ యిందఱున్
సుందరు లిందఱున్ మిగుల శూరు లుదారులు వీరిలోన నా
సుందరి యొక్కనింగొన నసూయమెయిన్ మనమెల్లఁ బోరినన్
నిందకు మూలమౌ నిది యనీతియొ! నీతియొ! నిర్ణయింపుమా.

క॥ అనుడు యుధాజిత్తను నీ, వనిన ట్లిచ్ఛాకృతస్వయంవర మిది యొ
క్కని ననవద్యచరిత్రుని, ననఘుని వరియించెనేని హర్షమ మాకున్

చ॥ పలువు రఖండతేజులు నృపాలకుమారకు లుత్తమోత్తముల్
గలయెడ నెవ్వఁడో యొకఁ డగణ్యుఁడు కన్యఁ బరిగ్రహింప యో
గ్యులు గని యూరకుందు రదియున్ గడుయుక్తమె!సింహభోగ్యమా
పలలము నక్కకున్ విడువఁబాడియె!యేడవి!నీతివాక్యముల్. ౮౫౮

గీ॥ అగ్రజాతికి వేదమ్ము లధిక బలము, చాపమెక్కుడుబల మగుఁక్షత్రి
యులకు, బలము గలవానిరాజ్య మీఁపడఁతిమిన్న,బలమ శుల్కంబు
రాజవివాహములకు. ౮౫౯

వ॥ అయ్యాది సుదర్శనునకుం గలిగెనేని యతండ పరిగ్రహించు నితరులకుఁ గలదేని యితఁడలు వడయుదు రని యన్యోన్యకలహమ్ము లొనర్చునవనీపతులకడకు సుబాహుం డాహూతుండై వచ్చుటయు.

క॥ అవనీపాలుర కెల్లను, వివాదముతటస్థమాయె వింటివికద! యో, యవనీవర! నీవియ్యెడ,వ్యవస్థనేర్పఱచి వీరివా దడఁపఁదగుఁన్. ౨౬౧

వ॥ అన నతం డిట్లనియె.

చ॥ జనవరులార! నాకొమిరె చాల సుదర్శనునిన్ వరింపఁగా
సనయము నెంచుచున్న దతఁ డర్హుఁడు గాఁడని యెంతచెప్పినన్
విన దతఁడున్ స్వయంవరపువేడుక వచ్చె బహూక్తు లేల దై
వనియతి కన్యధాకరణపాటవ మేరికినైనఁ గల్గునే. ౨౬౨

వ॥ అనుడు నాతని చిత్తవృత్తి నెఱింగి సంపన్నులగు రాజన్యు లందఱును సుదర్శనుం బిలువంబంచి యిట్లనిరి. ౨౬౩

ఉ॥ ఓయి నృపాలపుత్ర! యిటకొక్కరుఁడై చనుదెంచి తీవు సే
నాయుతు లెందఱో నృపతినందను లాహవమాచరించి య
బ్జాయతనేత్రి నీశశికలాబ్జముఖిన్ గ్రహియింప నున్నవా
రీయెడ నీకుఁ జేయఁగల దించుకయున్ గనుపట్టనేర్చునే. ౨౬౪

శా॥ నీకుం దమ్ముఁ డఖండశౌర్యనిధి వర్ణింపంగ యోగ్యుండు లో
కైకాగ్రిణ్యుఁడు శత్రుజిత్తును సహాయీభూతుఁడై తాతయున్
వీఁక న్నిన్ను వధింప నియ్యెడ కొరిన్ విచ్చేసియున్నారు నీ
రాకత్యంతము శోచనీయము కదా! రాజన్యవంశాగ్రిణీ. ౨౬౫

గీ॥ ఎవరు పిల్చిరో! నిన్ను నీవేకతమున, వచ్చియుంటివో! కలిగిన వాస్త వంబు, చెప్పితిమి మీఁద నీదగుచిత్తవృత్తి,కర్హ మగున ట్లొనర్పు మటన్న నతఁడు. ౨౬౬

ఉ॥ వారలఁ గాంచి యిట్లను నృపాలకులార! కృపాళులార! మీ
పేరిమి యింతయొప్పునొకో! భీతిలియిప్పుడు లాభమేమి! నా
భారము దేవదేవి దిటఁ బంపిన దాజగదంబ నాకు నై
క్షీరమొ! నీరమో! యొకటిచేయదె! శత్రులచేతికిచ్చునే. ౨౬౭

చ॥ ఎలమి సమస్తమందుఁ బరమేశ్వరినే కనుఁగొందు నాకు శ,
త్రులనుచు మిత్రు లంచుఁగలరో! యలరారెడివేడ్క నంబ నా
కలఁగనుపట్టి పొమ్మనినఁ గన్గొన వచ్చితి నీస్వయంవరం
బలుక నెవండు న న్నెదురు నాతని కంబిక శత్రు వయ్యెడుర్.
మ॥ బలమిచ్చున్ యశమిచ్చు సంపదలిడున్ బాలించుఁ దేలించు దు
ర్బలులన్ జేయు దరిద్రిలం బొనరుచున్ భంజించు గుంజించు నే
యలఘుప్రాభవ యేజగజ్జనని యేయార్యామహాదేవి త
ద్బలమే నాకు బలంబు తక్కబలమున్ బాటింప నే నెన్నఁడున్.
క॥ శక్తు లశక్తులుగలరే!, శక్తియనుగ్రహము గల్గు జనులే శక్తుల్
శక్తికృపలేనివార ల,శక్తులు బ్రహ్మాదులైనఁ జనవరులారా! ౪౨౦
చ॥ జయమయినం బరాజయము సంభవమైనను నాకుఁ గాదు త
జ్జయ మజయమ్మునున్ యశ మసద్యశమున్ జగదంబ! కట్టి నా
కయి వగవంగఁ బోకుఁడు మహామహులార! దయాళులార! ని
శ్చయముగ నేను శక్తుఁడ నశక్తుఁడ నేమిటి కీవిచారముల్. ౪౨౧
వ॥ అను నాతని వచనమ్ములకు సంతసించి కొందఱురాజులిట్లనిరి.
క॥ నీపలుకులెల్ల నిక్కము, భూపకులవతంస! నీవు పుణ్యాత్ముఁడ వెం
తోపగఁ బూని యుధాజి, ద్భూపతి యున్నాఁడు మఱచి పోయెదు సుమ్మీ. ౪౨౨
వ॥ నావుడు సుదర్శనుండు రాజేంద్రులారా! మీకు నాయందనుగ్రహం బింత యొప్పినకతనం గదా! యింతపట్టు నాకెఱింగించితిరి దైవాధీనం బగునీచరాచరాత్మకప్రపంచంబున మృత్యు వనునది తనంతన సంఘటించునుగాని యొకని నొకఁడు చంపువాఁడు లేఁడు. జీవుండు కర్మాధీనుండుగాని స్వతంత్రుండుగాఁడు. కర్మంబును సంచితవర్తమానప్రారబ్ధభేదమ్మున మూఁడు దెఱంగులై యొప్పుఁ గాలకర్మస్వాభావవ్యాప్తంబగు నీజగంబునఁ గాలం బాసన్నంబుఁ గాదేని దేవునకైనఁ జంపఁ నశక్యంబు. కాలవశంబున మృతు లగుప్రాణులకు యముండు నిమిత్తమాత్రంబుగా నెఱుంగునది. సింహంబు కతన మజ్జనకుండును యుధాజిత్తు కారణంబున మన్మాతామహుండును మృతులగుటయు నిట్టిదకా

తెలియుఁడు. తానెంత ప్రయత్నం బొనర్చినను దైవయోగంబు మూఁడినఁ జావక తీరదు. ౪౭౩

గీ॥ ఎవ్వఁడో తన్ను రక్షింపనేల! దైవ,బల మొకటితప్పకుండినవాఁడు శత్రుభయము రోగాదిభయమును బాసి వేయి, వత్సరమ్ములు జీవించువంత తగునె. ౪౭౪

క॥ శుభమును నశుభమునను నీ, యుభయమును బురాకృతమున నొడఁగూడును దా, ను భయంబందినఁ దప్పద, నుభవించియ తీరవలయును నరులకెల్లన్. ౪౭౫

గీ॥ తానొనర్చినకర్మంబు తనకుఁ గష్ట, మొసఁగుటెఱి తెల్విగలవాఁడు వ్యసనపడఁడు, అన్యు లపకారమును దనకాచరించి, రనుచు నజ్ఞుండు వైరమ్ముఁ గని కృశించు. ౪౭౬

ఉ॥ దైవము నమ్మి వచ్చితిని దైవమ సైన్యము తోడు నీడయున్
దైవమ తల్లిదండ్రులును దైవమ వైరియు నాకు సర్వమున్
దైవమ తద్బలంబు సుఖదాయియొ కష్టము నిచ్చునట్టి దో
భావిఫలం బెఱుంగ మనపాటిమనుష్యుల కర్హ మెట్లగున్. ౪౭౭

గీ॥ అయ్యుధాజిత్తు సుఖములనందుఁ గాక, యతఁడుశత్రుండుగాఁడు నే నతనికైన, నగుదుఁ గాక మఱేమి! లోకైకజనని, కలదు నాపాలిటికిఁ గల్పకంబు పగిది. ౪౭౮

వ॥ అనుడు నెల్లరు సంతసించిరి సుదర్శనుండును దనయెడ కరిగి సుఖంబుండె. మఱునాఁడు సుబాహునిచే నాహూతులై రాజన్యులందఱును దదాస్థానమ్మున విమానసంగతు లగునమరులం బోలె మంచంబుల నధిష్ఠించి శశికలాగమనమ్మున కెదురుచూచుచు నక్కలికి యెవ్వని వరించునో యని సందేహించువారును సుదర్శనుండక్కొ నొరుల వరింప దనువారలును నట్లైన నన్యోన్యకలహంబు దప్ప దనువారును నైయుండు నెడ, ౪౭౯

ఉ॥ మంగళవాద్యముల్ సెలఁగ మజ్జనమాడి విభూషితాంగియై
యంగజుపూవుబాణమన నాలలితాంగియుఁ బట్టుపుట్టమున్

రంగుగఁ గట్టి యొప్పుగఁ గరంబునయందు మధూకమాల వే్రి
లంగ నృపాలపుత్రులు కలంగఁ జెలంగి సఖీసమేత యై. ౮౭౦

వ॥ తత్సభానికటమ్మున నొకమణిస్తంభంబుచాటునఁ దలవంచు
కొని చింతించుచున్నం గని స్మితపూర్వకంబుగ సుబాహుం డిట్లనియె.

శా॥ అమ్మా! కన్గొనుమమ్మ! రాజసుతు లత్యంతోన్నతుల్ మేటిరూ
పమ్మందుర్ మదనుల్ యశోన్వితు లతిప్రౌఢుల్ నినుర్ గైకొన
న్నెమ్మి న్నేఁడిట వచ్చియుండి రొకనిన్ నీకిష్ట మావాని నే
ర్పొమ్మా! రూపవయఃకులోన్నతికలాకూలంకషాలంకృతున్. ౮౭౨

వ। అనుడుఁ దండ్రికి నక్కుమారిక యిట్లనియె.

ఉ॥ కాముకు లున్మదుల్ శఠులు కశ్మలచిత్తులు పాతకుల్ జగ
త్స్వాములు వీరియగ్రమున సాధ్వులు వర్తిలరాదు “సాధ్వియౌ
భామిని భర్తఁ దక్క నొరుఁబాఱఁగఁ జూడఁగ రా” దటంచు వి
ద్యామహితుల్ వచింతు రిది ధర్మవిరుద్ధ మొనర్ప నేర్తునే. ౮౭౩

క॥ పలువురదృగ్విషయంబై, కులకన్యక చనిన దానికొఱ కెల్లరు నుం
దలపోయుదు రెల్లిదముగు, వెలపొలఁతుకభంగి దానివిభవంబెల్లన్ .

ఉ॥ మాలిక చేతఁ బూని తగుమానినిభంగి స్వయంవరస్థలం
బేలలితాంగి త్రొక్కు నదియే వెలభామిని వేఱ యున్న దే
చాలుగ నున్న యీనృపతిసంఘములోఁ జొఱఁబాఱ నాకునుం
బోలునె తండ్రి! యేను వెలబోటినె! యిప్పని నాచరింపఁగన్.

క॥ ఏను సుదర్శను స్వామ్రి, దానన కద! సభకు నేగి తక్కొరుఁ జూడం
గానేమి! మానమున కవ, మానం బొనరింపఁ దగునె మానిని
నయ్యున్. ౮౭౬

మ॥ వసధుల్ వట్టిన భూమి వ్రక్కలయినన్ భాస్వంతుఁ డస్తాచల
మ్మున నావిర్భవమందినన్ శశి కుహూస్ఫూరిన్ ప్రవర్తించినన్
విను మే నల్లసుదర్శనున్ విడిచి పృథ్వీనాథు వేఱొక్కనిన్
గన మున్ట్రన్ వినఁ బేర్కొనన్ మనమునన్ గాంక్షింప ముమ్మాటికిన్.

క॥ కావున నాతనికి నను, న్నివిచ్చి వివాహ మెల్లి నేఁటఁ దగు గతిన్
గావింపుము కాదేనిన్, జీవితమున కిపుడ విడుతుఁ జేరెఁడునీటన్.

## సుబాహుండు చింతించుట

వ॥ అనువచనంబు లాలించి సుబాహుం డితికర్తవ్యతామూఢుండై తనమనమ్మున, ౪౮౯

ఉ॥ వచ్చినవారు రాజు లనవద్యచరిత్రులు వేనవేలు వీ
రిచ్చకమాడినన్ వెడల రేమియొనర్తు! మదాత్మజాతకు
న్నచ్చినయాసుదర్శనుఁడనన్ బలహీనుఁడు; నాకు వీరిచేఁ
జచ్చుట సంభవించె నిది శత్రువు పుత్రిక గాదు గా! తుదిన్. ౪౯౦

వ॥ అని కొండొకసేపు విచారించి ధైర్యమ్ము దెచ్చుకొని పలువురితోఁ గలహించుట యెట్టిబలవంతునకేనిఁ దగదని వారినొప్పించువాఁడై వినయవినమితుండై బద్ధాంజలిపుటుండై దీనుండై డగ్గఱఁ జని యిట్లనియె. ౪౯౧

ఉ॥ ఓనరపాలురార! కరుణోదధులార! మహాత్ములార! నా
పై నెనరుంచి నాదుపొరపాటు క్షమించి యనుగ్రహించి నా
మానముఁ బ్రాణముల్ మిగుల మన్ననఁ జేసి యొసంగి కూర్చున
న్నానముల్ గ్రహించి చనుమానమునన్ దయసేయు టొప్పగున్.

ఉ॥ ఎన్నివిధంబులన్ విఱిచి యే బతిమాలిన వానిఁ దక్క మా
కన్నియ యన్యు నొల్ల నని గట్టిగఁబట్టును బట్టియున్న దే
మన్నను మాఱువల్క దది యన్నెముఁ బున్నె మెఱుంగనేర ద
న్నన్న! మదర్థమై శ్రమమునందితి రిందఱునున్ వృథాగతిన్.

మ॥ కరులన్ రత్నములన్ దురంగమములన్ గ్రామంబులన్ గాంతలన్
సిరులన్ సౌధములన్ మహాంబరములన్ శ్రీమించుపూఁదోఁటలన్
ధరణీరాజ్యము నెల్ల నిచ్చెదను నాతప్పొప్పులన్ సైఁచి కూఁ
తురు గా నాదుకొమార్తనెంచి నను నిర్దుష్టున్ బొనర్పం దగున్.

వ॥ అని బహుభంగులం బ్రార్థించు నాసుబాహున కొక్కరును మాటాడక మిన్నకుండిరి. యుధాజిత్తు క్రోధతామ్రాక్షుండై పండ్లు పటపటఁ గొరుకుచు నిట్లనియె. ౪౯౨

ఉ॥ ఏమివచించెదీవు! మది నింతవివేకము లేక పుత్రికన్
సోమరివై సుదర్శనునిసొమ్ముగఁ జేయఁదలంచి యోగ్యులన్

భూమివరేణ్యులన్ వెడలిపొమ్మనలే కిటు నక్కజిత్తులన్
వేమఱుపన్నినన్ దెలియనేరమె! తక్కొరులంత మూర్ఖులే. ౯౬

తే॥ మొదలన సందియం బయిన మూర్ఖుఁడవై యిటులెల్లరన్ వృథా
విధిమెయిఁ బిల్వఁబంచి పలవించినఁ బోవునె! నన్నుఁ జూడు నీ
మదమడఁగించి చక్కడఁచి నందుని నింద్యుని నీసుదర్శనున్
బదిలము చేసి మన్ననికిఁ బట్టనుగట్టెద నీకుమారికన్. ౯౭

క॥ అనిలోనాకొక్క సుదర్శనుఁడుప్పో! యూరుఁగాయొ! సకలనరేంద్రుల్
పనిగొని యెదురుకొనిన నో, క్కనిమిషమునఁ జక్కడంపఁ గల
నెఱుఁగవొకో. ౯౮

శా॥ భారద్వాజమునిం గణించి మును తత్ప్రాణం బుపేక్షించితి
న్వీరుల్ వీరలుమెచ్చ నేఁడడఁతు నీనేర్పింకఁ జాలించి యా
నీ రేజాక్షిని నాదుమన్ననికిఁ బెండ్లింజేసి రక్షించుకొ
మ్మో! రాజ్యంబు మదాశ్రయంబుకలిమిన్ మేలించి కీలెంచుమీ.

తే॥ గీ॥ రాజ! "నీచాశ్రయోనకర్తవ్య" యనఁగ, వినవొ? యేమని యీ
సుదర్శనుని కిత్తు, వాత్మజాతను; మహదాశ్రయంబు గోరి, తేని
నావచనుమని కిమ్ము మానవేంద్ర! ౧౦౦

క॥ ఒక్క సుదర్శనుఁ దక్కఁగఁ, దక్కొరుల వరించెనేనిఁ దగులాటంబుల్
పొక్కవు మంటపమునకున్, జక్కఁగ నీతనయఁ బిలువఁ జనుము
నృపాలా! ౧౦౧

వ॥ అనిపల్కు నయ్యుధాజిత్తున కుత్తరం బీనేరక కాశీరాజు చిం
తాక్రాంతుండై తలవంచుకొని యంతిపురమ్మున కరిగి భార్యం గాంచి
యిట్లను "నోతరుణీ! యెల్లైన సుదర్శనున్ విడిచి మనకన్నియ యన్యుని
వరించున ట్లొనరింపవలయుఁ గాదేని మానంబుదక్క" దనవుడు వల్లెయని
యాపె శశికల పాలికిం జని మెల్లన నిట్లనియె. ౧౦౨

ఉ॥ అమ్మరో! యీసుదర్శనునికన్న బలాఢ్యులు రూపవంతులున్
సొమ్ములు గల్గువారలును జూడఁగ వేలకొలంది వచ్చి ర

ర్థమ్మును బ్రాణమానములుదక్క విం కాతనిం గోరితేని మా
యమ్మ! వినంగదమ్మ! పదవమ్మ! స్వయంవరరంగభూమికిన్. ౧౦౩

క॥ వినుము సుదర్శనుం గోరిన, ఘనుండు యుధాజిత్తువాని (గడతేర్చి
క్షణం, బున నిన్ను నన్ను నీజన, కుని నట్లొనరించు నంత క్రూరుం
డుం గలండే. ౧౦౪

క॥ అని నయమున భయమున న,వ్వనజముఖికిం దెల్పునాయవసరంబునం ద
జ్జనకుండు సుబాహుభూపతి,చను దెంచి మఱియును జెప్పెం జనువున
బలిమిన్. ౧౦౫

క॥ వెస నాశశికలయును దా, నసిధారావ్రతముపూని యగ్ని నుఱికెదన్
విసమున్ మెసవెద నన్యుం డు,విషమాంబకుండైన నొల్ల వేయేమిటికిన్

చ॥ వినుము నృపాల! నామనవి వీరలకున్ మది జంకు దేని న
న్ననువుగ నాసుదర్శనున కర్పణంజేసి రథమ్మునందు మ
మ్మునిచి మహోత్సవం బలర నూరికి నావల విడ్వ మట్లొన
ర్చిన నెదిరించుశత్రుల హరింపం గలాండతం డాహవమ్మునన్. ౧౦౭

వ॥ అను నబ్బాల కతం డిట్లను.

చ॥ పలువురితో విరోధమది బ్రహ్మకునైనం దరంబుగాదు నా
పలుకు గణించి పంతమును బట్టకు మెవ్వరికైన సాహసం
బలవడ దన్ని కార్యములయందును "వెట్టి యడంగె రోఁకలిన్
దలకును జుట్టుమం" చను విధమ్మునం బల్కుదురమ్మ! పుత్రికా. ౧౦౮

చ॥ వదలుమటంచుం జెప్పెదవు వారలు వీరలు వైరయుక్తు లు
న్మదులు నృశంసు లెల్లనరనాయకులున్ మిముంజుట్టి యేకమై
కగిసిన మీరొనర్పం గలకార్య మొకించుక యేని లేదు నా
మదిమెటులొప్పు! దుర్మదులు మానక యెంతకునైన నొప్పరే.

వ॥ నా కొక్క యుపాయంబు దోంచుచున్నయది. మున్ను సీతా
వివాహమ్మున జనకుం బలెం బణం బేర్పఱతు నట్లైన నిర్వివాదంబుగ సమ
ర్థుండగు వేరొకండుగాని సుదర్శనుండుగాని నిన్నుం గైకొను ననుడు

శశికల యిట్లను నోయయ్యా! సమర్థుండైనఁ గాకున్న నాకు సుదర్శనుం
డ భర్త కాని యన్యుండు గా నేరఁడు. ౫౧౦

ఉ॥ ఈవు పణంబు నేర్పఱచితేని ధనాంగనరీతి నేనురుల్
గావలె వీరికిన్ సమముగా వశనై; యొకఁడెవ్వఁడో ననుం
జేవ గలాఁడో? వేఱొకఁడో చేకొను నప్పుడుమాత్రి మెల్లరున్
భూవిభు లూరకుందురె? సముద్ధతు లెంతురె? ధర్మపద్ధతుల్.

క॥ ఏవిధినైనను గలహము, భావియ లోకైకజనని భావించి నను౯
దేవేరిగ నొనరింపు య, థావిధిగ సుదర్శనునకుఁ; దలఁకకుమింక౯.

వ॥ స్వయంవరమంటపమ్మున కరిగి రాజులంగాంచి యుపాయ
మ్మున నిట్లనుము. "నేఁటిదినమ్మున కీసభంజాలింతమెల్లిన నీకార్యంబు నెల్లి
సమర్థించెద నిది నిక్కువ"మని యవ్వారిని విడిదల కంపించి యీరేయి
గుప్తంబుగ నాతని రావించి విధివిధానంబుగ నన్ను సమర్పింపుము.
మీఁద నాతండు నన్నుఁ దనరథంబునం దిడికొని పోవనేర్చు రాజులు
సంగరోన్ముఖులై దుర్మదమ్మున నడ్డుపడిరేని యస్మదుపాసితయగు శక్తి
య నివారించుఁగాక. కాదేని సుదర్శనుతోడి లోకంబు నాకును జేకురు
నింత నిశ్చయంబని మఱియును, ౫౧౩

క॥ ఒసఁగిన నొసఁగుము విధిగా, నొసఁగంగా నేరవేని యొగినాయంతన్
బ్రసవశరుఁడుసాక్షిగ దేవి సహాయగ నతనివెంటవెడలెద ననుడున్


శశికలావివాహము

వ॥ సుబాహుండును గుప్తంబుగా సుదర్శనునకు వివాహంబు
సేయందలంచి చని సభ్యుల కిట్లను. నేఁటి కీసభ చాలింతము రేపు భవ
దిచ్ఛానుసరణంబుగ స్వయంవరంబగుఁ దడవొనరింపక ప్రకృతము విడు
దులకు దయసేయుం డనుడు నంగీకరించి రాజన్యులందఱును శిబిరమ్ముల
కేగి పురంబునల్గడల రక్షకులనియోగించి సుఖంబుండి రంత నతండును
వివాహంబునకుఁ దగుసంభారం బొనరించి యార్యుల రావించి యొరు
లెఱుఁగకుండ సుదర్శనునిబిలిపించి మంగళస్నానాదికృత్యంబులునిర్వర్తిం
చి యిరువు రనేకవేదిఁ గైసేయఁ జేసి యాచమనీయార్ఘ్యపాద్యమ్ము లాచ

రించి యనర్ఘవస్త్రద్వయం బొసంగి మధుపర్కంబిడి గోవును సమర్పించి కుండలమ్ము లలంకరించి విధివిధానమ్ముగఁ గన్యాదానం బొనరించె.

ఉ॥ అంత సుదర్శనుండు దగ నాలలితాంగి సుధాకరాస్య సు
స్వాంత ననంతరమ్యగుణ నంబుజపత్రవిశాలనేత్ర ని
శ్చింత రమాసమన్ హరి శచీసతిఁ బోలె గ్రహించె మేదినీ
కాంతుఁడు గాశిరాజు పలుకానుకలన్ దనియించె నల్లునిన్. ౫౧౬

ఉ॥ పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మిమెఱుఁగున్ దళుకారుబంగరుం
బొమ్మయుఁ బోని యానృపతిపుత్రిక నెత్తి యలంకరించి పొం
క మ్మగుయానమందు నెసకమ్మున నుంచియు మంటపమ్మును
ధ్యమ్ము నలంకరించినసుదర్శనుపాలికిఁ దెచ్చి రిమ్ముగన్. ౫౧౭

వ॥ అంత బురోహితుండును నగ్న్యాధానం బొనరించి లాజావిసర్గంబు నిర్వర్తింపఁజేసి ప్రదక్షిణాదికం బొనరింపఁ జేయుడుఁ గాశీరాజు సంతుష్టాంతరంగుఁడై సర్వోపస్కరయుతంబు లగు రెండువందలరథమ్ములును నానాలంకారయుతంబు లగునసేకపసహస్రమ్ములును విహంగమరాజవేగమ్ము లగుతురంగాయుతమ్ములును గ్రమేళకశతంబులును కాంచనభూషితంబులగుదాసీశతంబులును వివిధచిత్రవిచిత్రతంబు లగువాసగృహమ్ములును పూఁదోఁటలును ప్రకటమ్ము లగుశకటమ్ములును తక్కుంగలుగునానావిధవిశిష్టపదార్థమ్ములును నుపాయనంబుగా నొసంగి యల్లునిఁ గారవించి వియ్యపురా లగుమనోరమం గాంచి విహితాంజలిపుటుండై యిట్లనియె. ౫౧౮

క॥ అమ్మా! యీసుత నీసుతు, సొమ్మయి నప్పుడిఁక నీదుసొమ్మ నేలా
నెమ్మిగలిగి యెంతయు గారమ్మున నేల్లొమ్మ నేఁగరములు మొగడ్చున్.

వ॥ అనుడు మనోరమ సంతోషపూర్వకంబుగ నిట్లను.

గీ॥ ఇంతకన్నను వృద్ధిచే నెసఁగుమయ్య, రాజ్యహీనుండనక మహారాజ
వయ్య, నిచ్చితివి మత్సుమారున కిగురుఁబోఁడి, రత్నపుంబొమ్మవోని
గారాపుఁబుత్రి. ౫౨౦

ఉ॥ ధీరులయందు నుత్తముల ధీవరులందుఁ గృపాళులన్ మహో
దారుల వీరులన్ మఱియు ధన్యుల మాన్యుల నన్యులందు నిం

కేరు భవత్సమానులు! మహీంద్రమహేంద్ర! సుబాహుభూప! మా
భారము నీది నీకొమరె భారము మాయది నేటివారమే. ౧౧

ఉ॥ ఏరికినైనఁ బుత్రికలనిచ్చెడిచో ధనధాన్యసంపదా
ధారవిహారపుష్పవనతల్పము లాదిగఁ గల్గుభాగ్య వి
స్తారము నెంతు రెంతటివదాన్యశిరోమణు; లట్లుఁ గాక సా
ధారణు మత్కుమారకు సుతాపతిఁ జేసితి వింత యొప్పునే. ౧౨

మ॥ ధనధాన్యంబులు గల్గి యెక్కుడగువిద్యాబుద్ధులం బొల్చి వ
ర్తనలం బెద్దలమెప్పుఁ గాంచినమహాధన్యాత్ములౌ రాజనం
దనులన్ జూడక నీకుమారి తనయంత న్నాతనూజాతు ని
ర్ధనునిం గోరుట కేను మెచ్చ నిను నాంతర్యమ్మునన్ మెచ్చెదన్.

వ॥ అనవుడుఁ బ్రీతుండై సుబాహుం "డోయమ్మా! నీకొమరుండు
రాజ్యవిహీనుండని విచారింపనేల? మదాజ్యం బఖిలం బతనిది కాదే
యని మఱియును, ౧౩

శా॥ నారాజ్యం బఖిలంబు నిచ్చెదను సేనాసీత్వముం బూనెదన్
నీరాజ్యం బిది యేను సేవకుఁడ నానీభేదమేలా! పయో
నీరన్యాయమునన్ వసింపుదము మన్నీలున్న వారిం కఁ ద
ద్వైరం బెట్టులొ సామదానములనో వారింతు భేదాననో. ౧౪

క॥ ఆమాటఁ జక్కఁబడరే, నేమాయెన్ సంగరంబె యే నొనరింతున్
బో! మానిని! జగదంబిక,యే మన కన్నిఁటికిఁ గలఁ ది కేటికిఁజింతల్

వ॥ నావుడు మనోరమ యిట్లను.

ఉ॥ నీవచనంబుచేతన జనించె ముదంబు మదంబ నీకు సౌ
ఖ్యావహ యన్యోడున్ సుఖములందుము పుత్రులతోడఁగూడి యీ
భూవలయంబు నీవ తగుపోణిమి నేలుకొనంగదయ్య! మ
ద్దేవియ మత్కుమారునకుఁ దెచ్చి యొసంగును దండ్రిరాజ్యమున్.

చ॥ కరమున మన్నుపట్ట నది కాంచనమౌఁ దనయత్న మింతయుం
బొరయకయే సమస్తమును బూర్ణమగున్ బ్రజలందఱున్ మహా
దరము వహింతు రెమ్మది ముదమ్మునఁ బొంగు సమస్తకార్యముల్
సరిపడు నొక్కపెట్ట గ్రహచారము చాలినయప్పు డేరికిన్. ౧౫

ఉ॥ చింత యొకింత లే దఖిలజీవులకుఁ సుఖవేళఁ గష్ట మొ
క్కింతయు రాదు కష్టమున నించుకయుఁ సుఖమబ్బఁ బోదు లె
మ్మింతకు నాతనూజునకు నిప్పటికాలము మంచిదౌట నా
వంతయు వంతరాదిఁకఁ బ్రయత్న మొనర్పుము కూఁతునంపఁగఁ.

వ॥ అని యన్యోన్యకష్టసుఖపరిచారమ్ముల నారేయిఁ గడపుచు న్నంత నగరమ్మున విడిసియున్న రాజకుమారులు మంగళతూర్యాది నిస్వనమ్ము లొక్కింత యాలించి,

ఉ॥ కొంద ఱిదేమి హేతు వనుకొందురు కొందఱు పెండ్లికాల మీ
చందమునం జెలంగు నని సందియ మందరు కొంద ఱీసృపుం
డందఱ మోసపుచ్చి తనయాత్మజ నాతనికిచ్చి పెండిలిం
దొందరగా నొనర్చెడివినోదము గాఁ దగు నందు రమ్మెయిఁ. ౧౩౦

చ॥ అంతటఁ గాశిరాజు విసయమ్మున రాజులఁ బిల్వ నేగ భూ
కాంతులయుం దొకఁడయిన గౌరవముఁ బొనరింపఁ డంతయుఁ
స్వాంతమునం దెఱింగియు సుబాహుఁడు వెళ్ళెఁబోక "యోధరా
కాంతులు ! పెండ్లి విందునకుఁగా దయసేయుఁడు మీర లెల్లఁ

క॥ నాపుత్త్రి యెంత చెప్పిన, మాపలుకులు వినక తనదుమది కెక్కిన
యా, భూపతనూజు సుదర్శను, నే పెండిలియాడెఁ జెప్పఁ జేమి
యొనర్తుఁ ? ౧౩౨

తే॥ గీ॥ మిమ్ము నిమ్మెడ దయఁజూపి మించుపేర్మి, నించి నా గౌరవము
ను దక్కించుపొంకె, వేఁడుకొనియెద నావుడు ఱేఁడులెల్లఁ,
దలలు వంకించి యీరీతిఁ బలికిరతని. ౧౩౩

క॥ భోజనములాయె నొకరును, రాజా! రాఁజాల రకట! రాత్రివివాహ
శ్రీ జరిపి బడలియుంటివి,భోజనమున కేమి! పొమ్ము పోదుము మేముఁ.

వ॥ నావుడు సుబాహుండు వారలమనంబు గ్రహించి సంశ యించుచు నగరికరిగె నంత నారాజులలోఁ గొందఱు సుదర్శనుం జంపి కన్యకఁ గైకొందమనువారును నది న్యాయంబుగాదు మిన్నక యుత్స వంబు నాలోకించి పోవుదమనువారును మఱియు నానాప్రకారంబులఁ బ్రసంగించువారునునై యాయామార్గమ్ములం గాచియుండిరి. సుబా

హుండు తక్షుకాద్యంబుల సలక్షణమ్ముగా నెఱవేర్చి యల్లునిసతీసమేత మ్ముగా నంపువాఁడై పారిబర్హం బొసంగుచున్నంత. ॥౩౫॥

### సుదర్శన యుధాజిత్తుల యుద్ధము

క॥ దూతలువచ్చి సుబాహుధ, రాతలపతి కిట్టులనిరి రాజా! నీజా
మాతనిపుడంపఁబోకుము, రాతులుగలరయ్యతోవ రక్కసులక్రియన్.

వ॥ నావుడు సుబాహుం డంతకుమున్న రాజులచందం బెఱింగిన వాఁడ గుటంజేసి సంశయించుచుండ సుదర్శనుం డిట్లనియె. ॥౩౭॥

చ॥ నృపవర! వారలేమి యొనరింపఁగ లా రొనరించి రేని స
త్కృపగలతల్లి యాజగదధీశ్వరి నాకు సహాయభూతయై
రిపుల నడంపకున్నె తగురీతిఁ బ్రియాణ మొనర్పుమయ్య మా
తపసుల యాశ్రమమ్మున ముదంబున నుండెద మయ్య! తద్దయున్.

మ॥ తగువాసం బది గాదటంచు మదిఁ జింతం జేయఁగాఁ బోకు మొ
ప్పగు మాయాశ్రమమందు దివ్యమణిదీవ్యత్కందరాజాతమా
సొగసుంగుల్కెడిబావులా! చెఱువులా! సొంపారుపూఁదోఁటలా!
నగరుల్ మీనగరంబులుం దగవు విన్నాణంబునన్ దానికిన్.

వ॥ అనవుడుఁ గాశిరాజును నసంఖ్యమ్ముగా ధనం బొసంగి సతీసమేతంబుగా నంపుచుఁ దానును బలసమేతంబుగాఁ బిఱుందన వెడలె.

ఉ॥ అంత సుదర్శనుండు దనయంకమునందలి కాంతతో రతీ
కాంతుఁడు నాఁగ నిర్భయముగాఁ జనుదెంచెడివేళ రాజు ల
త్యంత "నుదే రథం బదె సుదర్శనుఁ డేగెడు గాంతఁ గూడి మీ
పంతములెల్లఁ జెల్లఁ జని పట్టుఁడు కొట్టుఁ" డటంచు రేఁగినన్.

వ॥ సుబాహుండు వారల కడ్డపడియె నంత సుదర్శనుండు నిశ్చలచిత్తమ్మున నేకాక్షరమ్మగు కామరాజమహామంత్రంబు జపించుచు నంబాపదనళినంబులు మనంబునఁ గీలుకొల్పి యుండె నాలోనన యుధాజిత్తును శత్రుజిత్తునున్ దాఁకిన. ॥౪౨॥

ఉ॥ వీఁక సుబాహుఁ డాత్మభుజవీర్య మెలర్పఁగ శంఖదుందుభి
ప్రకటరావముల్ సెలఁగ బాణపరంపరలన్ యుధాజిదా

ఖ్యాకు నెదిర్చె నిర్భర కఖండముగాఁ బొసఁగెన్ రణంబు! ని
ర్భీకత నంబపై మనము పెట్టి సుదర్శనుఁ డప్పు డొప్పుగన్. ౫౪౩

ఉ॥ దారుణరీతిగా రణము తద్గతి నొప్పుచునుండ దివ్యదా
కారముతో మహాయుధనికాయముతోఁ దగువల్వతో నలం
కారముతోడఁ గల్పసుమకాండపరీవృతదివ్యమాలికా
భారముతో మృగాధిపతివాహనయై జగదంబ గ్రిక్కునన్. ౫౪౪

వ॥ ప్రత్యక్షం బగుడు సుదర్శనుండు హర్షపులకితగాత్రుండై మామకుం జూపుచు, ౫౪౫

ఉ॥ ఇంక భయమ్ము చెంద మన కేమిటి! కంచు రథమ్ము డిగ్గి యే
ణాంకముఖీలలామ యగునంగనతోఁ దనమామతోడ ని
శ్శంకఁ దదంబికాంఘ్రిజలజమ్ములకుఁ బ్రణమిల్లె నేన్గు లా
తంకము చెంద సింగమును ధ్వాన మొనర్చె ననూనరీతిగన్. ౫౪౬

వ॥ మఱియు ఘోరవాయువులు వీచె దిక్కులు మిక్కిలి దారుణ ప్రకారంబులయ్యె దానంజేసి రాజులందఱును భీతిల్లి నిశ్చేష్టులై మహాశ్చర్యపర్యాకులులై చూచుచున్నంత సుదర్శనుండు సేనాధిపతి కిట్లను. నస్మదుపాసిత యగుజగదంబ శరణమై యేతెంచె నింక నీ వారులకుఁ దలంకక రాజసంకుల మ్మగుపథమ్మున ననర్గళమ్ముగ సైన్యమ్ముఁ బో నిమ్మన వుడు నతం డట్లు చేసె యుధాజిత్తు భయగ్రస్తులై మాఱ్రిప్పుడి చూచుచున్న రాజులం గని యిట్లనియె. ౫౪౭

ఉ॥ సింగముమీఁద నెక్కి యొకచేడియ వచ్చినయంత భీతులై
క్రుంగఁగ నేల? రాజు లధికుల్ గలచో నొకదుర్బలుండు త
న్వంగిని జేకొనంగ నది యారసి యూరకయుండఁ జెల్లునే?
వెంగలి వీనిఁ జంపి పృథివీపతిపుత్రికఁ దెత్త మిత్తఱిన్. ౫౪౮

క॥ అని తాను శత్రుజిత్తును, గినిసి సుదర్శనునివంకఁ గీలించె శరా
సన మాకర్ణాంతంబుగ, ననేక బాణముల వాని నాతఁడు త్రుంచెన్.

వ॥ అంత నంబికయు.

చ॥ కనులను మిణ్గుఱుల్ సెదరఁగా నృపులందఱు కన్నిమూపులై
కనలి యనేకబాణముల గాడఁగ నేసిన సంకులక్రమం

బునఁ దగె యుద్ధరంగము; సముజ్జ్వలదేతదనూనబాణమ
ర్దనమున శత్రుజిత్తతనితాతయుఁ గూడఁ బరేతులై రొగిన్. ౹౹౧

వ॥ తక్కంగలవార లందఱు నద్దానికిఁ బరమాద్భుతం బందిరి. సుబాహుండు పరమప్రీతుండై యానందబాష్పమ్ములు వెల్లివిరియ నప్ప రశక్తి నిట్లని వినుతించె. ౹౹౧

ఉ॥ పేరిమి సర్వభక్తజనపీడ లడంచెడితల్లిరో! నమ
స్కారము శాంతి విద్య శివ కామద నాఁ జనుతల్లిరో! నమ
స్కారము కొల్చువారలకు సంపద లిచ్చెడితల్లిరో! నమ
స్కార మకారణంబ యుపకార మొనర్చుట నీక చెల్లెడిన్. ౹౹౨

పంచచామరము॥ సమస్తజంతుజాలమున్ బ్రశస్తసత్కృపాకటా
క్షమంగళోజ్జ్వలత్తరంగసంగతిం బొసంగఁజే
సి మేలుఁ గూర్చి ప్రోచుతల్లి! శ్రీకరిన్ నినున్ సదా
నమస్కరింతుఁ బ్రోవు మమ్మ! నన్నుఁ బేర్మి మీఱఁగన్

క॥ అగుణ వగునిన్నుఁ గొనియాఁ, డఁగలనె? మూఢుండ సగుణుఁడన్ దుష్టుండన్, భగవతి! నీయాథార్థ్యం, బు గనం జాలరు విరించి ముఖు లగుసురలున్. ౹౹౪

గీ॥ ఈవ వాగ్దేవతవు బుద్ధి నీవ మతివి, నీవ జంతువులకు గతి నీవ నిన్ను నుతి యొనర్పంగఁ దరమె! మనోనియంత్రి,వగుచు నెల్లెడ వర్తింతు వఖిలజనని. ౹౹౫

ఉ॥ తావకభక్తముఖ్యుఁడు సుదర్శనుసంగతిఁ జేసియేకదా!
భావుకమై యశేషజనపావనమై యజముఖ్యదుర్లభం
బై వెలుగొందుత్వత్పదనవాంబురుహద్వయి నూడఁగంటి నీ
సేవకకోటిలో నొకనిఁ జేసి ననుం గరుణించు మమ్మరో! ౹౹౬

ఉ॥ అంబ! రిపున్ హరించి భవదంఘ్రిరజోలవలేశధారి బా
లుం బలహీనునిన్ విజయలోలు ననాథు సుదర్శనున్ గృపా
లంబితచిత్తవై శశికలాసతితోఁ గరుణించి తింత పూ
ర్ణం బగునమ్మ! నెమ్మి నిను నమ్మి భజించెడిభక్తకోటిపై. ౹౹౭

సీ॥ మంత్రతంత్రమ్ము లెఱుఁగ నీమహిమ యెఱుఁగ, మూఢభక్తిని వినుతింతు మొఱకు నన్నుఁ, బాలనము సేయుమమ్మ! నీవాఁడ నమ్మ!, కిల్బిషమ్ము లడంచి రక్షింపుమమ్మ! ౫౫౭

వ॥ అని బహుభంగుల నుతించుసుబాహుం గరుణించి యంబ భవదభీష్టం బేమనుడు బద్ధాంజలిపుటుండై యానందపులకితగాత్రుండై యిట్లనియె. ౫౫౮

శా॥ తల్లీ! నీదగుదర్శనంబుకతనన్ ధన్యుండనై యున్న నే
నొల్లన్నేర్తునె వేఱొకండు; కరుణాయోగమ్మునం జేసి నా
యుల్లమ్మందు వసించుటొక్కటియు లోకోత్తంస మీకాశి ను
ద్యల్లీలన్ వసియించుటొక్కటియు నిన్నర్థింతు నత్యంతమున్.

క॥ దుర్గమమగురిపువర్గ మ్మ,నర్గళకృప సంహరించి నన్నేలినయో
సర్గవిధాయిని! నాపురి, దుర్గాభిఖ్య నివసింపు తుంపుము రిపులన్.

గీ॥ ఈపురంబెంతదనుకఁ దా నిల వెలుంగు, నంబ! నీవంతదనుక మా కభయదాత్రి, వగుచు వసియింపవలయు మహానుకంప, దనర నిచ్చోట; నిదియ నాకును వరంబు. ౫౬౨

వ॥ నావుడు జగదంబిక యంగీకరించెఁ బిమ్మట సుదర్శనుం డామె నిట్లు వినుతింపఁదొడఁగె. ౫౬౩

గీ॥ సృష్టిరక్షావిలయములు సేయఁ జాలె, దంబ! యొక్కింతయిచ్చ నీకమ రెనేని, యట్టినీవిట్టిదీను నన్నాదరించి, కాచితి వటన్న నిదియు దుష్కరమె నీకు! ౫౬౪

గీ॥ ఏమికార్య మొనర్తు!నే నెచటి కేగు, వాఁడ! మూర్ఖుఁడనయ్యు భవత్ప్రసాద, బలముచే సర్వ మొనరింపఁ గలను దేవి!, కృప దలిర్పంగ నా కాన తిమ్మనవుడు. ౫౬౫

ఉ॥ చేసెడిదేమి నాకు నృపశేఖర! యీలలితాంగితోడ మ
చ్ఛాసనమున్ వహించి విలసన్మతివై చని మీయయోధ్య సిం
హాసన మెక్కి నన్మఱవ కంచితరీతిని రాజ్య మేలుకో
మ్మా! సురనాథవైభవుఁడవై నిను నేఁ బయి నుండి కాచెదన్.

క॥ బలిదానవిధానం బది, యలరఁ జతుర్దశిని నవమి నష్టమిని సనర్గ
గలకాలమ్మును శ్రద్ధా, కలితుఁడవై పూజ సేయఁగా వలెఁ జుమ్మీ.

క॥ అదికాక శరత్కాలము, మదభీష్టం బెంతయేని మత్పూజలు నె
మ్మది నవరాత్రవిధానము, పొదలఁగఁ దత్కాలమందుఁ బొనరుపు
వత్సా. ౧౬౮

గీ॥ మాఘచైత్రాశ్వినాషాఢ మాసములను, నొప్పఁగాఁ జేయుమయ్య
మహోత్సవములు, కృష్ణపక్షచతుర్దశి కేవలనవ, రాత్రములు
నష్టమియును బాత్రములు మిగుల. ౧౬౯

చ॥ అని వివరించి యంతటఁ బరాంబ యదృశ్యతఁ గాంచె నాసుద
ర్శనుసరిఁ జేరి యెల్లరును రాజులు భక్తియు నమ్రభావముం
దనర సురల్ సురాధిపువిధమ్మున మ్రొక్కి నుతించి రంబికన్
మనమున నమ్మువారు జనమాన్యత గాంచుట కేమి శంకయా.

క॥ మానవ యగుసుబాహుండును,భూమీపాలకులతోడఁ బోయి యత
నికిం, జేమోద్భవ ఘటించెను దె, జోమూర్తులయందు వయసు
చూడంబడునే. ౧౭౦

వ॥ పిమ్మట రాజన్యులందఱును సుదర్శనుం గాంచి మహాత్మా! నీ విఁక నయోధ్యాపురమ్మునఁ బైతృకం బగుసింహాసనమ్ము నధిష్ఠించి మమ్ముందఱఁ బాలించుచు మాచే వలయుపనులం గొనుచు నింతకు మున్నజ్ఞానవశమ్మున నొనర్చినయస్మదపచారమ్ముల సైరింపవలయు సంసారకూపమ్మునం బడి సారాసారవివేకంబు దక్కి పశువులగతిఁ దిరుగు మాకు నీయనుగ్రహమ్మునం గదా! జగదీశ్వరీసందర్శనంబు గలిగె నిట్టినీ కేమి యాచరింపం గలవార మని బహువిధముల ననునయించి మఱియును. ౧౭౧

చ॥ అడిగెద మొక్కమాట వినయమ్మున; సర్వ మెఱుంగునట్టియో
యొడయఁడ! దేవి నాఁగ నెవరో! యిట కెచ్చటనుండి వచ్చెనో!
కడుముద మయ్యె మా కెఱుఁగఁగా నొనరింపు మనన్ సుదర్శనుం
డెడపక వారి కిట్టులనియెన్ జగదీశ్వరి నాత్మ నెంచుచున్. ౧౭౨

ఉ॥ చెప్పెడిదేమి? యోనృపతిశేఖరులార! త్రిమూర్తు లాత్మ నె
ల్లప్పుడు నేజగజ్జనని నంబిక నెమ్మి భజింతు రాపె యే
యిప్పరశక్తి సాత్త్వికి మహీముఖలోకములెల్లఁ బ్రోచుఁ ద
న్నెప్పుడుఁ గొల్చువారలకు నిచ్చు నిరామయభాగ్యసంపదల్. ౫౭౭

గీ॥ చెలఁగుచు రజోగుణమ్మున సృష్టిసేయు, సత్త్వగుణమునఁ బాలిం
చు సంహరించు, నఖిలము తమోగుణంబూని; యక్కతనమున, స
గుణయననొప్పు నీశక్తి జగమునందు. ౫౭౮

క॥ ఈసగుణ శక్తియే యగు, దాసుల కెల్లరకు సౌఖ్యదాయినియును సే
వాసక్తులకుర్ నేవ్వ్యము;,వీసంబు నెఱుంగ నగుణవిధ మే ననుచుర్.

ఉ॥ చిన్నతనమ్మునందు వనసీమకు వెళ్ళెడి భీతి గ్రమ్మ బల్
విన్నఁదనంబుదోఁప నొకవిద్దెయు బుద్ధియు లేనిప్రాయమం
దెన్నఁగనట్టి శక్తికృప యేగతిఁగల్గెనటంచు మాకు న
న్నన్న! కదుర్ విచిత్రమగు నా తెఱఁగుర్ వినరించి చెప్పుమా.

గీ॥ అనుఁడు నతఁ డిట్టులను బాల్యమందు నాకుఁ,బట్టువడె నొక్కబీ
జంబు భాగ్యవశతఁ, బేర్మి నయ్యదియే కామబీజ మయ్యె, నదియ
నాకు నొసంగె విద్యాదికంబు. ౫౮౦

క॥ మునులకతన నప్పుడు వినియుంటిని వినాఁగఁ బిదప నదియె యం
బను జూడఁగ సాధనమ,య్యెను బీజావృత్తి కెంతయేనియుఁ దోడై.

వ॥ నావుడు రాజులందఱును బరశక్తి ప్రభావమ్మునకును సుద
ర్శనునదృష్టమ్మునకును సంతసించి తమతమపురమ్ముల కేగి సుఖంబుం
డిరి. సుబాహుండు నల్లునంపించి తనపురమ్మున కరిగి యయ్యెడ దుర్గాబి
యమ్ముగట్టించి ప్రతిష్ఠాదికంబొనర్చి విశ్వేశ్వరుతోఁ పాటు పూజాదులు
జరుపుచుండె. సుదర్శనుండు పరమోత్సాహమునఁ గోసలదేశమ్మున కరిగి
యయోధ్యానగరసమీపమ్మున విడిసె. ౫౮౦

సుదర్శనుఁడయోధ్య కరుగుట.

ఉ॥ సంగతి యంతయుర్ దెలిసి సంగతులై సచివుల్ మృదంగస
న్మంగళరావముల్ సెలఁగ నాగరకాంతలు లాజ లొప్పువే

డ్కం గురియింప వందులు గడంగి నుతింప నెదుర్కొనెన్ జయా
భంగురుఁడై సుదర్శనుఁడు పత్నియుఁ దానును నేగెఁ బ్రోలికిన్,

వ॥ ఇట్లు పౌరజనసమన్వితనానోపాయనగ్రహణపురస్సరంబుగ నంతఃపురంబు సొచ్చి పుత్రశోకమ్మునం గుందుచున్నసవతితల్లిం గాంచి నమస్కరించి వినయమ్మున నోదార్చుచు నిట్లనియె. ౫౧౭

క॥ నీతనయుని నీతండ్రిని, నీతివిహీనుండ నగుచు నేఁ జంపఁగ లే
దో తల్లి! భవత్పదకం, జాతమ్ములు సాక్షి శక్తి చంపె నిరువురన్.

గీ॥ ఒకరుచేసినకర్మంబు నొకరు పొంద, నేర్తురే! యిందులకు నింత యా
ర్తియేల!, తగ నవశ్యంబు కాఁదగుతంత్రములకు, శోకమందఁ రొకింత
తద్దుఃఖు నిజంబు. ౫౧౮

ఉ॥ దాసుని నన్ను నీసుతువిధమ్మునఁ జూడఁగదమ్మ! శోకముం
జేసి కృశింపనేల? దయచేసి మనోరమకన్న నెక్కుడై
వాసియు పన్నెయుం గలిగి వర్తిలవమ్మ! యొకింతభేదమున్
జేసెడివాఁడఁ గాను జననీ! పరిచర్య యొనర్తు నిచ్చలున్. ౫౧౯

క॥ తనచేసిన కర్మముచేఁ, దన కాపద సంభవింప దైవము దూఱున్
జన దన్యుల నిందింపన్,జన దయ్యది యనుభవమునఁ జక్కంబడెడిన్.

గీ॥ దారుమయకాంత సర్తక ప్రేరణమునఁ, జేసి నటియించు విధమున
జీవుఁడాత్మ, కర్మవశమున సుఖముదుఃఖమును జెందు, నందుఁదద్దుఃఖ
దుఃఖించు టనుచితంబు. ౫౨౦

గీ॥ చిన్నతనమున నీతండ్రి చెట్టఁదలఁచి, నన్ను రాజ్యవిహీను నొనర్చు
నప్పు, డేను గర్మానుభవ మని యెంచుకొంటిఁ, గాని శోకింపలేదు ని
క్కంబు తల్లి. ౫౨౧

క॥ నీతండ్రి వీరసేనున్, నాతాతన్ జంప నాజనని ననుఁ గొని దుః
ఖాతురయై కాంతారం, బేతెంచెడితోవ దొంగలేతెంచి వడిన్.

క॥ కట్టినపుట్టము మొదలుగ, నెట్టన హరియింప దుఃఖనీరనిధికిఁ దాఁ
గట్టెఱుఁగక పడుకష్టము, లెట్టిరిపులకైనఁ గూడ వెప్పటికైనన్.

వ॥ అట్టియెడ విదల్లుండును ధాత్రేయియు మమ్మును విడువక కష్టసుఖమ్ములకోర్చి వెంటఁ జనుదెంచిరి. గీ-౧

ఉ॥ పిమ్మట నెట్టకేలకుఁ దపించితపించి సురాపగాసమీ
పమ్మున నున్న యొక్క మునిపల్లెకుఁ జేరితి మాముసీందుృలుఁ
మమ్ముల గారవించియుఁ గృమమ్మున నింతకుఁ దెచ్చిరమ్మ! నా
కమ్మెయి దుఃఖ మిమ్మెయి ననంశమదమ్మును లేదు తల్లిరో! గీ-౨

వ॥ ఇప్పటికైన నేరియందు మాత్సర్యంబుగాని వైరంబుగాని లేదు. రాజ్యభోగంబుకన్న నీవారాన్నభక్షణం బొనర్చుచు నింద్రియ జయమ్మొనరించి ధర్మాచరణంబు కర్తం బని తోఁచెడి. సకలజన్మంబుల మనుష్యజన్మంబు దుర్లభం బదియునుభారతఖండంబున నగుటెక్కుడగు నట్టి జన్మంబునొంది సర్వసాధారణంబు లగునాహారాదిసుఖంబులందుచు మందుఁడై వర్తించుటకన్న స్వర్గమోక్షప్రదం బగుధర్మసాధనం బొన ర్చుట లెస్సగాదే! యనుసుదర్శనువచనమ్ములు విని లీలావతి లజ్జితయై పుత్రశోకంబు పరిత్యజించి యిట్లను. గీ-౩

చ॥ నిను నిటుచేయునప్పు డవినీతి యొనర్చు కున్న నన్ను మ
జ్జనకుడు లెక్కపెట్టక యసత్కృతి నీకొనరించి తాను జ
చ్చినఁ యదిగాక మత్సుతునిజీవముఁగూడ హరించెఁ దా నొన
ర్చినకృతి ద న్నడంచె నొకరిఁ జెరుపఁ విధి తన్నుమాపదే.

క॥ నీతాత వీరసేనుం, డే తాదృశుఁడే తలంప! నితనిని నాకై
నాతండ్రి చంపెనకటా!, యోతండ్రీ! తప్పునాది యొరులెవ్వరిటఁ.

క॥ నీతల్లి నాకుసోదరి, నాతనయుఁడ పీ వకారణంబుగ దుఃఖా
స్వీతనయు కుండనేల! మ,హీతలమేలుకొనుమిా మహేశ్వరికరుణఁ.

గీ॥ వారొనర్చినకర్మంబు వారిఁ జంపె, నిన్ను నిందింపఁ బాపంబు నేనె
యుఁగనె, చచ్చినకుమారునకు నేడ్వ సజ్జనుండ, వైన నిన్నలయించు
ట కడల వలదె. గీ-౭

వ॥ అని యోపె యానతిచ్చుటయు నతండు మంత్రులం బిలిచి దైవజ్ఞనిర్ణీతం బగుశుభముహూర్తమ్మున హేమసింహాసనంబు నిర్మింపం జేసి మణిమండితంబగు నొక్క ప్రాసాదమ్మునునుంచి తత్సింహాసనమ్మున

యథావిధిగ జగదంబిక స్థాపించి, సర్వకాలమ్ముల నీయంబిక నర్చింపుఁ
డని పౌరులకాజ్ఞాపించి పిమ్మటఁ బట్టాభిషిక్తుండై సుఖమ్ముగ రాజ్యభారమ్ము
వహించె. ౫౯౮

గీ॥ ఆసుదర్శనుకతమునఁ గంబ జగద, ధీశ్వరి కృపావలంబ లోకైకజనని
యలరి కోసలదేశమ్మునందు నిలిచి, యెల్లవారికి శుభముల నిచ్చు
చుండె. ౫౯౯

సీ॥ ధర్మజ్ఞుఁడై నీతిఁ దప్పక ప్రఖ్యాతిఁ బొందినయలదిలీపునివిధమున,
ప్రజలఁబిడ్డలరీతిఁ బాలించి యశముచేఁ బ్రబలినరఘుమహారాజు
పగిది, సత్యంబు దప్పక జగతిఁ బాలించి ప్రశస్తి కెక్కినహరిశ్చం
ద్రుమాడ్కి, శిష్టరక్షణదుష్టశిక్షావిశేషముల్ సలిపి యేలినరామ
చంద్రుపోల్కి; గీ॥ శుద్ధవర్ణాశ్రమాచార పద్ధతులును, ప్రతిగృ
హమ్మున నంబాసపర్యలును నెసంగ శశికల సౌఖ్యంబొసంగ సంగ,
తముగ రాజ్యం బొనర్చె సుదర్శనుండు. ౬౦౦

క॥ మామయు నల్లుఁడుఁ దమతమ, సీమల నంబాసపర్య చేయుకత
మునన్, గ్రామాదులలోఁ బండిత, పామరసాధారణముగఁ బ్రబ
లెన్ బూజల్. ౬౦౧

## నవరాత్రపూజావిధానము.

క॥ అన జనమేజయుఁడను గ్రన్నన శరదాగమమునందు నవరాత్రు
మ్ముల్, చనుదెంచిన నేవిధి నంబను బూజింపంగ వలయుఁ బరమము
నీందాఁ. ౬౦౨

క॥ నరపతి జనమేజయుఁ డా, దరమున నిటులడుగ మౌనితల్లజుఁడ
నియెన్, శరదాగమమందు వసం, తఋతువునందును యజింపఁద
గు జగదంబన్॥ ౬౦౩

మ॥ అరయన్ సర్వజనౌఘనాశకమ్ములై యత్యంతఘోరమ్ములై
పరమవ్యాధికరమ్ములయ్యుఁ గడు శోభాస్ఫూర్తి నొప్పారి శాం
కరికిన్ బ్రీతికరమ్ములై మిగుల వేడ్కల్ సేయు; లోకాళికిన్
శరదారంభవసంతముల్ శమనదంష్ట్రాప్రాయముల్ భూవరా.

క॥ కావున నీ బుతువులను శు,భావహనవరాత్రముల సమంచితభక్తి
శ్రీవిభవము లలరంగం బర,దేవత నర్చింతు రెల్లధీరులు నధిపా. ౬౦౯
వ॥ నవరాత్రివిధానం బెఱింగించెద సావధాన మనస్కుండవై యాకర్ణింపుము. చైత్రాశ్వయుజమాసమ్ములయందు సితపక్షమునం బ్రతిపత్తిథి మొదలుకొని నవరాత్రంబులును దేవినారాధించు నరుం డంతకు మున్నమవసయందుం దత్పూజాద్రవ్యంబులు సంగ్రహించుకొని యాడినమ్మున హవిష్యాశనంబున నేకభుక్తంబొనర్చి సమప్రదేశమ్మున షోడశహస్తపరిమాణమ్మును స్తంభధ్వజసమన్వితంబును నగు నొకమండపం బేర్పఱచి గౌరమృద్గోమయమ్ములచేం జక్కంగా నలికి ముగ్గుపెట్టి తన్మధ్యమ్మునం జతుర్హస్తవిస్తృతమ్మును నేకహస్తోన్నతంబును నగునొకవేదికం బీఠార్థంబు నిర్మించి విచిత్రతోరణవితానాదికంబులచే నలంకరించి మఱియును. ౬౧౦
క॥ ఆనాంటిరాత్రి మంత్రవి,ధానజ్ఞుల సకలవేద తత్త్వజ్ఞుల స
న్మానించి పిలువవలయు మ,హానియమములుగల్గు బ్రాహ్మణాగ్రేసరులన్.
వ॥ మఱునాం డుదయమ్మున నదీనదవాపీకూపతటాకంబులందొండె. గృహమ్మునందొండె స్నానం బాచరించి సంధ్యావందనాదులు దీర్చికొని పూర్వోద్దిష్టులగు బ్రాహ్మణుల నర్ఘ్యపాద్యాదికమ్ముల నర్చించి శక్త్యనుసారంబుగ వస్త్రాలంకరణాదుల సంతుష్టి గావింప వలయు.
గీ॥ ద్విజులు తొమ్మండ్రు వలయుం గా దేని నేపు, రైన మూగురునైన మహామహులం డొ,కండయినం గావలయుం బూజకాలమందు, నంబికామూలమంత్రజపంబుపొంట. ౬౧౧
గీ॥ మఱియుం బారాయణమునకై మహితు శాంతు, ననఘు నొక్కని వరియింప నగు ద్విజన్ము, స్వస్తివాచనపూర్వంబు శక్తిపూజ, మొదలు పెట్టంగవలయు సమ్మోదమలర. ౬౧౨
వ॥ పూర్వోక్తంబగు వేదియందు క్షౌమవస్త్రసమన్వితంబగు సింహాసనంబు స్థాపించి యందుం జతుర్హస్తయు నాయుధసమంచితయు రత్నాలంకార విరాజితయు ముక్తాహారభాసురయు దివ్యాంబరధారిణియు సౌమ్యయు సర్వలక్షణ సంయుతయు శంఖచక్రగదా

పద్మాన్వితయు సింహవాహనయు నగు జగదంబికి నాగమోక్తవిధా నంబున స్థాపింప వలయు. ౬౧౧

క॥ తగ నష్టాదశభుజ యగు, జగదంబికఁ బీఠమందు సంస్థాపనఁ జే
యఁగవలయుసంచుఁగొందఱు,నిగమవిధానజ్ఞులంద్రు నృపతివతంసా

వ॥ విగ్రహాభావమ్మున నవాక్షరమంత్రసంయుతంబగు యంత్రం బునుఁ బీఠపూజకై స్థాపించి దానిపార్శ్వంబునఁ * బంచపల్లవసంయుతం బును వేదమంత్రసంస్కృతంబును బుణ్యతీర్థజలపూరితంబును కనత్కనక రత్నసమంచితంబును నగుకలశంబునిలిపి యయ్యంత్రంబుతోపాటు పూ జింపవలయు నని మఱియును, ౬౧౩

క॥ మంగళమృదంగనిస్వన, సంగతవారాంగనాసుసంగీతకళా
భంగీతతనటనవ్యా, సంగాదికములను ప్రొద్దు జరుపఁగవలయున్.

వ॥ హస్తానక్షత్రయుక్తం బగుప్రతిపత్తిథిని బూజారంభంబొన ర్చుట మిగుల శ్రేయస్కరంబు. మఱియును, ౬౧౪

శా॥ అంబా! నక్తములుండి యొండె మఱి యేకాన్నంబుచే నొండె దీ
క్షం బూజించెడియీదినంబు లుపవాసంబుండి యొండెన్ మఖం
బుం బూర్ణం బొనరింతు నంచు నియమంబున్ శక్తికల్మిన్ దద
గ్రింబందున్ వచియించి పూనఁదగు నార్యాపూజకుం దొప్పఁగన్

సీ॥ మందార కరవీర మాలతీచంపకాశోక కరజదివ్య సుమచయములఁ
జందనాగురుకనచ్చారుకర్పూర బిల్వదళార్ఘ్యపాద్యాది లక్షణముల,
నారికేళకదళీనారంగదాడిమీ పనసాదితరుజాతఫలవితతుల, నన్న
పానముల దివ్యభక్ష్యభోజ్యచోష్యాదికంబులఁ బాయసాదికముల;
గీ॥ ధూపముల దీపముల మహాస్తుతుల నతుల, నతులగతుల వ్రతం
బు నున్నతు లొనర్చి, సతుల సుతుల సుమతుల సద్గతుల నలరి, వెత
లఁ బాయుదు రిదియ దేవీవ్రతంబు. ౬౧౫

క॥ ఎన్నిక శక్త్యనుసృతిగా, నన్నం బిడవలయు భూసురాదులకు; వ్రతం
బెన్నివిధంబులఁ జేసిన, నన్నంబిడఁ డేని వ్యర్థమగు నరనాథా.

---

* మేడి, మఱ్ఱి, రావి, జువ్వి, మామిడి.

గీ॥ మాంసము భుజించు వార లంబకా యజింతు, రేని బశువుల బలిదా
న మిఁగవలయు, నజవరాహమహిషము లత్యంతముఖ్య, ములు
బలివిధానమున కని మునులమతము, ౬౧౯

గీ॥ అంబకట్టెదుటను జంపినట్టిపశువు, లెల్ల స్వర్గమ్మునకు నేగు హింస
నింద్య, మయ్యు యజ్ఞాదికముల దేవ్యర్చనాది, కముల నింద్యమ్ము గాదు
స్వర్గదముగాని. ౬౨౦

వ॥ మఱియుఁ ద్రికోణం బగుకుండం బేర్పఱచి యందు హో
మం బొనర్ప వలయుఁ ద్రికాలమ్ములయందును నృత్తగీతవాద్యమ్ములు
సెలంగ మనోహరమ్ము లగుపూజాద్రవ్యమ్ములచే నర్చింపవలయు భూమిపై
శయనింపవలయు వస్త్రాలంకారాదికం బొసంగి కుమారికల నేకైకవృద్ధి
క్రమంబునఁగాని యంతకు ద్విగుణమ్ముగఁగాని త్రిగుణంబుగఁగాని
నిత్యంబును నారాధింపవలయుఁ గుమారీలక్షణం బెట్లంటేని, ౬౨౧

గీ॥ రెండువత్సరముల నల రెడునదియ కు,మారి; మూడేడు లైనచో
మహిప!యది త్రి,మూర్తి; నాల్గేనిఁ గళ్యాణి; మొన సెనేని, యైదు రో
హిణి; కాళిక యాఱు మొనయ. ౬౨౨

గీ॥ సప్తవర్షంబులైనచోఁ జండిక యనఁ,బరఁగు నెన్మిదియైన శాంభవి య
నంగ, నలరుఁ దొమ్మిదియైన దుర్గాఖ్య నెసఁగు, బదియయిన దాని
నెంతు సుభద్ర యనుచు. ౬౨౩

గీ॥ ఇంత కెక్కుడువయ సామెనేని శక్తి,సంతసింపదు తత్తదర్చనమునం
గు, మారిలోనగునట్టినామములు వాడ, వలయు నద్దాన నంబకుఁ
గలుగుఁ బ్రీతి. ౬౨౪

సీ॥ మాటిమాటికిని గుమారిఁ బూజించిన దుఃఖదారిద్ర్యముల్ తొలఁగి
పోవు, పూర్ణభక్తి ని దాఁ ద్రిమూర్తిఁ బూజించిన నాయుస్త్రివర్గ
ముఖ్యఫలమబ్బు, ననువుమీఱంగఁ గళ్యాణిఁ బూజించిన విద్యావిన
య రాజ్యవిభవ మొనయు, నకలంకభక్తిఁ గాళికఁ బూజచేసిన శత్రు
సంతతికి నాశనము పొసఁగు; గీ॥ చండిక యొసంగుసంపదల్; శాంభవి
యిడు, నృపుల నలరించు శక్తి; నెంతే నసాధ్య, కార్యములు నెఱ
వేర్చు దుర్గయు; సుభద్ర,వాంఛితము లిడు రోహిణి వ్యాధులడఁచు.

వ॥ మఱియు వీరలనర్చించుపట్ల శ్రీరస్తనుమంత్రింబున నొండె శ్రీయుక్తంబు లగుమంత్రంబులనొండె బీజమంత్రమ్ములనొండె నుప యోగింపవలయు. ౬౨౬

క॥ ఆరయఁ గుమారతత్త్వము, లారాజీవభవముఖ్యు లగుసురలను లీ లారీతిఁ సృజియించుకు, మారిం బూజించెదరఁ సమాహితభక్తిన్.

క॥ సత్త్వాదులచేతఁ ద్రిమూ, ర్తిత్వమ్ము న్నిఖిలరూపధేయత్వము వ్యా ప్తత్వమును గాంచుశక్తిఁ, దత్త్వనిధిఁ ద్రిమూర్తి భక్తి దనర య జింతురు. ౬౨౭

గీ॥ తనుభజించెడి భక్తసంతతికి నెపుడు, నఖిలకళ్యాణములును సమస్త కామ, ములు నొసంగెడి కళ్యాణి నెలమిఁ బూజ, చేసెద నఖండ భక్తి సుశ్రీలు సెలఁగ. ౬౨౮

గీ॥ సకలభూతమ్ములనుఁ బూర్వజన్మమందు, గూడఁబెట్టినబీజముల్ కొమ రుమిగుల, వెలువరించెడి రోహిణి విపులవిభవ, కారిణిఁ దలంతుఁ బేర్మి నఖండభక్తి. ౬౩౦

గీ॥ చండముండాదిహారిణి చండరూప, చండికకుఁ బూజలిడుదుఁ బ్రచండ భక్తి, కారణము లేని యుత్పత్తిగలుఁగు శాంభ, విని శుభప్రద భజియింతు విపులభక్తి. ౬౩౧

క॥ ఏవంవిధమంత్రమ్ముల, నేవంవిధపూజలను సమిద్ధము లగు నా నావస్త్రాలంకృతుల శు, భావహలగు కన్యకలకు నర్పింపవలెన్.

వ॥ మఱియు హీనాంగియు దుర్గంధబంధురయు గుష్ఠయుక్తయు వ్రణాం కితయు దుష్కులభవయు జాత్యంధయుఁ (1) కేకరయుఁ (2) కాణియుఁ గురూపయు బహురోమశయు రజశ్చిహ్నద్వయాంకితయు క్షామయు (3) గర్భసముద్భూతయు గోళకయుఁ గన్యకోద్భూతయు లోనగు కన్యకలవర్జించి యరోగిణియు సురూపాంగియు సుందరియు వ్రణవర్జితయు (4) నేకవంశసముద్భూతయు నగుకన్యక నర్చింపవలయు. సర్వకార్యమ్ముల బ్రాహ్మణియు జయార్థంబునృపవంశజయు లాభార్థంబు వైశ్యకులోత్పన్నఁ

(1) మెల్లకన్నుగలది.
(2) ఒకకన్నుగ్రుడ్డియైనది.
(3) 1 వత్సరము దాఁటుని వయస్సుగలది.
(4) ఒకరితండ్రికి జన్మించినది.

గాని శూద్రవంశసంభవఁగాని పూజనీయ లని యెఱుంగునది బ్రాహ్మణ క్షత్రియులకు బ్రాహ్మణియు వైశ్యులకుఁ ద్రివర్ణజయు శూద్రులకుఁ జతు ర్వర్ణసంభవయుఁ గావలకు స్వకులోద్భవయు నారాధ్య లని యె ఱుంగుము. ౬౩౩

క॥ నవరాత్ర విధానమున వి, భవము కొలఁదిఁ బూజసేయఁ బరమహి తము శ, క్తివిభవశూన్యుండష్టమి, ని విశేషంబుగ యజించెనేనియుఁ జాలున్. ౬౩౪

గీ॥ అష్టమిని మున్ను దక్షయజ్ఞాపహంత్రి, యగుచుఁ దను యోగినీకోటు లనుసరింప,భద్రకాళి జనించె నృపాల! తన్ని, మిత్తమున నష్టమిని బూజ మేలుఁగూర్చు. ౬౩౫

క॥ నవరాత్రికాల మెల్ల ను, పవాస మొనరింప లేనివారికి నుపవా సవిదులు సప్తమి యష్టమి, నవమియు నివి మూ డుపోషణము లనిరి నృపా, ౬౩౬

## నవరాత్రిమహాత్మ్యము

క॥ ఈమూడుదినములను దగు, హోమంబులఁ బూజనముల నొగి న లరింపన్, గామము లిడు నవరాత్ర మ, హామహాకర్తలకుఁ బలెఁ బరాంబిక కరుణన్. ౬౩౭

క॥ నవరాత్రివ్రతమున కీ, యవనిన్ వేఱొండుసాటి యనుకొనకుము వై భవమిడు నాయువు నిడు నిడు, శివమున్ విద్యయును యశముఁ జేవయుఁ బరమున్. ౬౩౮

క॥ విను రాజ్యభ్రష్టునకున్, దనయంతన రాజ్యమబ్బు ధరణీశ్వర! వి ద్యనుగోరి పూజచేసిన,ఘనులకు విద్యలవియెల్లఁ గరగతము లగున్.

క॥ వెనుకటిజన్మమ్మున నే, జనులీనవరాత్రపూజ సలుపరో? వారే యనపత్యులురిక్తులు రో,గనిధులు దుర్జను లగుదురుఁ గష్టులుభ్రష్టుల్

గీ॥ విధవలును వంధ్యలును ధనవిరహితలును, నైనకాంతలఁ గన్గొని నప్పుడీ యు,భాగ్యలెల్లరుఁ బూర్వభవమ్మునందు, నీవ్రత మొనర్ప లే” దని యెఱుఁగు మధిప. ౬౪౧

గీ॥ ఘనతరంబుగ రక్తచందనవిమిశ్ర, బిల్వదళముల నెవఁ డతిప్రీతి దనర
నంబ నవరాత్రములఁ బూజనంబొనర్చు,నతఁడు భూపతి యగును
భూపతివతంస. ౬౪౨

చ॥ హరిహరపద్మగర్భులును నష్టదిగీశ్వరు లెల్ల దేవతల్
పరమమునీంద్రు లందఱును భక్తి దలిర్పఁగ నేపరాంబికా
చరణములన్ యజించి విలసద్గతి నొందుదు రమ్మహేశ్వరిన్
నరులు యజించు టబ్బురమె? నారక మేగెడివారు దక్కినన్.

గీ॥ బ్రహ్మసర్గంబు విష్ణువు పాలనంబు,హరుఁడు లయమును జేయు నేయం
బకతన, నాజగద్ధాత్రి సర్వపాపహంత్రి, నమ్మహేశ్వరిఁ బూజించు
టబ్బురంబె. ౬౪౪

గీ॥ పలుపలుకు లేల విను మహాపాతకము లొ,నర్చుదుర్మార్గుఁడైన నె
వ్వఁగ నొక్క, సారి నవరాత్రముల జగజ్జనని పూజ, సేయఁ బాపమ్ము
లెల్లను బాయు నిజము. ౬౪౫

వ॥ రాజేంద్రా! మున్ను కోసలదేశమ్మున సుశీలుం డనునొక్క
వణిజుండు ధనధాన్యవిహీనుండు గలఁ డాతనికి సంతానం బధికంబు,బిడ్డ
లఁ బోషింపనేరక యొక్కనాఁ డొక్కవిప్రసత్తముంగాంచి నమస్కరిం
చి యతం డిట్లనియె. ౬౪౬

క॥ ఓవిప్ర! మహాభాగ! కృ, పావంతుఁడ వగుచు నాయభాగ్యదశను నీ
వేవిధినైన నహరింపం,గావలయుఁ గుటుంబభృతియుఁ గఱవై తోఁచున్

క॥ ధనికుఁడఁ గావలెనని నె, మ్మనమున నా కిచ్ఛ లేదు మన్నించి కృ
పం, గని నాకుటుంబభరణ, మ్మునకు నుపాయం బొకండు పొనరువు
మానఘా. ౬.౪౮

క॥ నాకొడుకులు నాకూఁతులు, నాఁకలికిం దాళలేక యన్నంబడుగన్
లేక యొనర్చెడి దేమియు, లే కిటువచ్చితిని జూడలేక మహాత్మా!

క॥ అదిగాక పెండ్లికీడై, నది గలదొకకూఁతు రదిదశాధికవర్షం
బాదవినఁగన్యాదానో,క్తదశకుఁ జెడుఁబెండ్లి యగునెధనహీనులకున్

గీ॥ దానిఁ దలఁచిన గుండె బ్రద్దలగు నాకు, నేమి సేయుదు? దారిద్ర్యమెట్లు
విడుచు, సరసి యేదేని నొక్కయుపాయమున్న, బూని యొనరించి
పుణ్యమ్ముఁ బొందుమయ్య. ౬౫౧

వ॥ అని బహుభంగులం బ్రార్థించిన నవ్వైశ్యుం గాంచి సంశ్రిత
వ్రతుండును దేవీమహత్త్వవేత్తయు నగు నావిప్రుండు వల్కునో యనఘా!
శరత్కాలమ్మున నాశ్వయుజసితపక్షమ్మునఁ బ్రతిపదాది నవరాత్రవ్రతం బొన
ర్చి దేవినారాధించితేని నీదారిద్ర్యంబు దొలఁగు నిద్దానికి వేఱొండు
తుల్యమ్ము గాదని చెప్పి మఱియును, ౬౫౨

ఉ॥ జ్ఞానమునిచ్చు మోక్షమునొసంగు వెస న్నవరాత్రకాలము
దేనరుఁడైన నంబ జగదీశ్వరిఁ బూజనభోజనంబులన్
ధ్యానములన్ జపంబులను దద్దయు హోమములన్ ధనాంగనా
గానవినోదనృత్యములఁ గ్రన్ననఁ దుష్టియొనర్చి మించినన్.

వ॥ మున్ను శ్రీరామచంద్రుం డరణ్యమ్మున సీతావియుక్తుండై
కిష్కింధానగరమ్మున సుగ్రీవసాహాయ్యమ్మున నీనవరాత్రివ్రతం బొనర్చి
యకాదే సముద్రంబు బంధించి పుత్రమిత్రపరివారసహితంబుగ రావణ
కుంభకర్ణులహరించి విభీషణునకు రాజ్యంబిచ్చి సీతంగైకొని యయోధ్య
కేతెంచి నిష్కంటకంబుగ రాజ్యంబొనర్చెఁ గాన నీవ్రతంబు శత్రు
నాశకరంబు సంపత్కరంబు సంతానదాయకంబని చెప్పి యావైశ్యునకు
మాయాబీజాభిధం బగుతన్మంత్రం బుపదేశించిన నతండు తనగృహ
మ్మునకరిగి యథాశక్తిగ నీవ్రతంబు తొమ్మిదివత్సరమ్ములొనర్చె నంత,

ఆ॥ వె॥ నవమవత్సరమున నవరాత్రముల నష్టమీదినమున రాత్రి మేదు
రాదరంబెసంగ నతనికంబ ప్రత్యక్షమ్మై, పెక్కు వరము లిడియెఁ
బేర్మి మీఱ. ౬౫౩

వ॥ అనుడుఁ బరాశరాత్మజునకుఁ బరీక్షిదాత్మజుం డిట్లనియె.

క॥ శ్రీరాముఁ డేకతమ్మున, దారం గోల్పోయె నతనితండ్రి యెవ? రతం
డేరాజ్యమేలు? రాజ్యం, బేరీతిఁ ద్యజించి యడవి కేగెనో? చెపుమా!

వ॥ నావుడు జనమేజయునకు వ్యాసుం డిట్లనియె.

గీ॥ దశరథుండను రాజయోధ్యాపురమ్ము, నేలు నినవంశజుండు సుశీలుఁ
డతని, సతులు మూఁగురు పెద్ద కౌసల్య రెండ,వయది కైకేయియును
మూఁడవది సుమిత్ర. ౬౫౭

## శ్రీరామచరిత్ర.

వ॥ అతండు సంతానవిహీనుండై పుత్రకామేష్టి యొనర్చి ము
గురియందు నలువురుకొడుకులఁ గనియె నందు. ౬౫౮

క॥ కౌసల్యకొడుకు రాముఁడు, భాసురుఁ డాతండు మిగులఁ; భరతుఁడు
కైకే, యీసుతుఁడు! సుమిత్రకు రిపు, శాసకు లగులక్ష్మణుఁడును
శత్రుఘ్నుండున్. ౬౫౯

గీ॥ జాతమాత్రంబునన ధనుశ్శస్త్రపాణు,లయిన నలువురు కొమరుల కా
నృపాలుఁ, డర్హసంస్కృతు లొనరించి యలరునంతఁ, గౌశికుం డే
గుదెంచె మఖం బొనర్ప. ౬౬౦

గీ॥ వచ్చి మఖరక్షణకు ననవద్యు రాముఁ, గోరె షోడశవార్షికుఁ గువలయే
శుఁ, డిచ్చె లక్ష్మణుఁ జతఁ జేసి; యేగిరిరువు, రును మునీశ్వరు నెంట;
దారి నొకచోట. ౬౬౧

గీ॥ మునులబాధించు తాటకఁ దునిమి కడువి,నీచుని సుబాహుఁ జంపి
మారీచు నిహత,కల్పుఁగాఁ బాఱఁదోలి మఖంబొనర్పఁ, జేసె రా
ముండు కౌశికుచేత నంత. ౬౬౨

చ॥ ఎలమిని మూఁగురున్ మిథిలమేగెడిచో రఘురామపాదస
జ్జలజపరాగసంగతిని శాపము వాసె నహల్య; శైవ మా
విలు విరుగంగఁ జేసి యట విక్రమధుర్యుఁడు రామమూర్తి మై
థిలి జనకుం డిడన్ గొనె సతీమణి గాఁ గమలాంశసంభవన్. ౬౬౩

గీ॥ లక్ష్మణున కిడె నూర్మిళ లలితగాత్రిఁ, దగఁ గుశధ్వజతనుజాతల గుణ
వతుల,భరతశత్రుఘ్నులకు నిడెఁ బార్థివుండు, సపరివారముగఁ బురి
కిఁ జనిరివారు. ౬౬౪

గీ॥ అంత దశరథనృపతి రాజ్యార్హుఁ డైన,రామునకు రాజ్య మీనెంచు
రాణ నెఱిఁగి, పూర్వదత్తవరంబులఁ బొందెఁ గేక, యాత్మజ వశం
డయిన భర్త నడిగి పిదప. ౬౬౫

క॥ ఒకవరమున రాముఁడు జా, నకితో లక్ష్మణునితో వనంబేగెను వే
ఱొకవరమున భరతునకున్,బ్రికటగతిన్ రాజ్యమబ్బెఁ బదునాల్గేడుల్

గీ॥ చండరాక్షసయుత మగుదండకావ, నమ్మునకు రాముఁడేగఁదాపమ్ముఁ
జెంది, దశరథుఁడు పూర్వశాపమ్ము దలఁచితలఁచి, పరగతికి నేగ
నంతట భరతుఁ డాత్మ. ౬౬౭

గీ॥ మిగులశోకించి తనతండ్రిమృతికిఁ దల్లి, తనకిడినరాజ్యమని మనమ్మున
నెఱింగి, సకలరాజ్యంబు విడిచె నన్నకుఁ బ్రియం బె, సంగుననుబుద్ధి
శ్రీరామచంద్రుఁ డచట. ౬౬౮

క॥ పంచవటికేగి మదనో, దంచితన్మై కోరురావణానుజ నెంతే
వంచించె శూర్పణఖ నది,గాంచి ఖరాదు లతికోపకలుషితులగుచున్.

క॥ ఒకనరుఁడధముఁడు చెలియలి,ముకుచెవులునుగోసె వింతపుట్టెననుచు
మే,టికడిమియుద్ధం బొనరిచి,యొకపెట్టన ద్రెళ్లిరందఱొగి రామునిచే.

క॥ మునిహితముగ రాముఁడు గ్ర, న్ననఁ దానిటుచేయ శూర్పణఖ
లంకాప, త్తనమేగి రావణునకున్, దనపరిభవ మంతఁ జెప్పి తద్ద
యు నార్తిన్. ౬౭౦

క॥ శోకించిన రావణుఁడు రు, డాకలితుండగుచు వెడలి యరదము డిగి
మా, యాకరుఁ డగుమారీచా, ఖ్యాకునిఁ గాంచనమృగంబు గాఁ
జేసి వెసన్. ౬౭౧

క॥ పనిచిన జానకిఁ గని కాం,చనమృగమని భ్రాంతిఁజెంది చర్మంబును జ
య్యనఁ దెచ్చి యిమ్మనుచు రా,మునిఁగోరెన్ దైవము కతమున
నాతండున్. ౬౭౨

శా॥ ఆలోచింపక లక్ష్మణు న్విడిచి చాపాస్త్రమ్ములం దాల్చి హే
లాలోలం బగునమ్మృగమ్మునకునై లక్షించిలక్షించి వృ
క్షాళిన్ గుమ్మరి కొండలన్ గడచి కక్షాంతంబు రాఁదీసి శౌ
ర్యాలంకారుఁడు బాణ మేయ నదియున్ హా! లక్ష్మణా! యం చొగిన్.

క॥ ఉచ్చైస్స్వాదం బడరఁగఁ, జచ్చినఁ దద్విపులరవము జానకి విని బల్
హెచ్చినభయమున లక్ష్మణు,సచ్చరితుంగాంచి యనువసవసయెసంగన్

క॥ నీయన్న నిహతుఁడాయెఁ గ, దోయీ! వేవేగనేగవోయీ! జాగుల్
జేయక యోపినకొలఁది స, హాయమ్మగుమోయి! "లక్ష్మణా!" యనె
నోయీ! ౬౭౬

చ॥ అన విని లక్ష్మణుండు జనకాత్మజ కిట్లను "రాముఁ జంప నో
పునరులు పుట్టువారలును బుట్టినవారలు బుట్టఁబోవువా
రును మఱిగారు రాఘవునిరూఢి నెఱుంగవె? యాజ్ఞఁ దప్పి నేఁ
జనిన సహించునే? తనదుచావున కొప్పను గాని మానినీ. ౬౭౭

క॥ ఇంతకు రాఘవునకు నొ, క్కింతయు భయమబ్బదింత యేమిటికన! న
క్కాంతయుఁ గన్నుల నశ్రులు, దొంతరలై జాలువారఁ దుడుకునఁ
బలికెన్. ౬౭౮

చ॥ తెలిసె భవన్మనోరథము తెల్లముగా; ననుఁ జెందు నిచ్ఛ నీ
కలవడెఁ గేకయీతనయుఁ డంపె నిన్ను "సమయంబుఁ జూచి యి
వ్వెలఁదిని గొ" మ్మటంచు వినువెట్టినె? రాముఁడు వోవుమీఁద ని
య్యేల నిలువంగనేర్చి వరియింతును నిన్నని నమ్ముకొంటివే. ౬౭౯

క॥ చనినఁ జనును,చనకుండినఁ జనకుండును రాముఁడే నిజంబునకుల్ జ
చ్చినఁ జచ్చెద నన్నయెడల్ ,బొనరుచునుపకార మిదియహో దుష్టాత్మా!

క॥ అనవుడు హరిహరి! తల్లీ!, యనఘుని నన్నిట్టులాడ నగునే? యని దై
వని యోగమునకు వగచుచుఁ, జనియెల్ బాష్పాంబు సిక్తసర్వాం
గుండై. ౬౮౧

గీ॥ దంబుమీఱెడిభిక్షువేషంబు దాల్చి,యంతనిక్కంపుయతివోలె నవని
జాత, యున్నెడకు వచ్చె రావణుం; డుదితభక్తి,నర్ఘ్యపాద్యాదులిచ్చె
నయ్యవనిపుత్రి. ౬౮౨

గీ॥ ఆయవనిపుత్రిరూపు కన్నారఁ గాంచి, రావణుండను "నకట! రాజీవ
నయన!, యెవఁడునీతండ్రి! నీజీవితేశుఁ డెవఁడు?, వనమునం దొంటి
నుండఁ గావలయు నేమి. ౬౮౩

ఆ॥ వె॥ భర్తయనదమైన భ్రాతృవర్గంబైన,లేదె! మేడలందుఁ బొరిదిసేయఁ
దగిన నీయడుగులు దగునె యీకర్కశా, రణ్యభాగములకు
రాజవదన! ౬౮౪

గీ॥ మునివనితఁ బోలెఁబర్ణశాలను వసింప,వాఁ గెనే బ్రహ్మ!యని మాయవ
గలఁబొగులు, కపటయతి యైనరావణుకపటకృత్య, మెఱుఁగ కిట్లని
పల్కె నయ్యిందుముఖియు. ౬౮౫

సీ॥ దశరథుం డనురాజు ధర్మజ్ఞుఁ డతనికి నలువురుపుత్త్రులాయలఘులందు
జ్యేష్ఠుండురాముఁ డాశ్రితజనవత్సలుం డాతండు నాభర్త యతనిసవతి
తల్లి కైకేయియుత్తమురాలు వనమునకంపించె రాజ్యమ్ము నపహరించి
వసియించునాతఁ డివ్వనమున; నిప్పుడ చనియెఁ గాంచనమృగంబును
వధింపఁ; గీ॥ దమ్ముఁడును నేఁగె నిరువు రుద్ధతబలాఢ్యు, లరుగుదెంచెద
రింతలో నంతదనుక, నిలిచి వారలొసంగు పూజలనుదనిసి, యను
గుటకు నిమ్ముఁ బ్రార్థింతు యతివరేణ్య. ౬౮౬

గీ॥ యతివి విష్ణుస్వరూపుఁడవైనకతనఁ, బూజనీయుఁడవైతి వెవ్వడును
రక్క, సులు చరించెద రివ్వనస్థలికి నెచట, నుండివచ్చితో! చెప్పుమ
నీయున్నయునికి. ౬౮౭

మ॥ అనుచున్ రావణుఁ డిట్లువల్కు వినుమాయాభిక్షురూపమ్మున
న్నినుఁ జూడన్ జనుదెంచినాఁడఁ దరుణీ! నే రావణాఖ్యుండ శూ
ర్పణఖాఖ్యాక మదీయసోదరి నినున్ వర్ణించి వర్ణించి చె
ప్పి ననుం బంచె ఖరాదిరాక్షసులఁ జంపెన్ రాముఁడంచున్ వడిన్.

మ॥ హృతరాజ్యుండు వనప్రవాసి విగతశ్రీకుం డపూర్ణుం డసం
గత సైన్యుం డబలుండు మానవుఁడు వేడ్కల్ సేయునే నీకు నీ
పతి; కాంతల్ మగఁ డెట్టివాఁడయిన సంభావింప రన్యార్థినున్
నతు నత్యున్నతు దాసు నన్నుఁ గొనుమీ నారీశిరోరత్నమా!

క॥ మందోదరియనిచెప్పఁగ, విందునకా! యొప్పె నాదుపేర్మియుసి ని న్నా
సుందరి కన్నధికముగ, నందల మెక్కింతు రాజ్ఞి వగు మెల్లరికిన్.

చ॥ సురపతి నోంచితిన్ జమునిచొప్పడఁగించితి శ్రీదు మాపితిన్
వరుణుని గెల్చితిన్ శశిదివాకరులన్ బనిగొంటి నాకు నీ
నరుఁడొక్క లెక్కయే! యొకయనంగుని కోపఁగఁజాల నింక నీ
చరణములాన యింత దయ సల్పఁగరాదె? త్రిలోకసుందరీ! ౬౯౧

ఉ॥ నేఁటిది గాదు నీయెడల నేస్తము నాకుఁ; గటాక్షముంచు మో
పాటలగంధి! నీజనకుఁ బల్కరు వేఁడిన శైవచాప మున్
గాటపుటద్దు దెల్పెఁ జెలి! నా కది గూడనిదౌట నేను నా
నాఁట స్వయంవరంబును గనన్ జనుదేరఁగ లేదు సుందరీ! ౬౯౨

గీ॥ నాఁటనుండియు విరహమ్ము నాటె నాకు, నెట్లు సంప్రాప్తమగుచు
వో యీ వటంచు, ననుకొనుచునుండ నేఁటికి నబ్బె తింక, జాగునే
యకు నాయనురాగ మెఱిఁగి. ౬౯3

క॥ అను రావణువచనముల క, వనిజ భయముచెంది మనముఁ బాదు
కొలిపి «నో,జననింద్య! మదనపీడిత!, యనుచితములు ప్రేలఁబోకు
మరుగు మవలకున్. ౬౯౪

ఉ॥ స్వైరిణిఁగాను నే జనకసత్కులసంభవఁ గాని నావనో
ధీరత గుర్తెఱుంగ కిటు దెప్పరమాగతిఁ బల్కు నీకు నా
కారణమై మృతిం గనెడికాలము చేరువగాక యున్నె? యే
వీరునికైనఁ గాని రఘువీరునితో నెదిరింప శక్యమే. ౬౯౫

క॥ పోపొమ్మని వచియించుచుఁ, గోపమ్మునఁ బర్ణశాలకుం జనునా
లోఁ, బాపాత్ముఁడు రావణుఁడు స్వ,రూపము గనుపఱచి భీకరుం
డగుచువడిన్. ౬౯౬

ఉ॥ హా! రఘురామ! యంచు సుగుణాకర! లక్ష్మణ! యంచుఁ బిల్చుచున్
ఘోరననేడ్చు నాజనకపుత్రి బలాత్కృతి నెత్తిపట్టి బల్
దారుణరీతి నంబరపథంబునఁ బో నరుణాత్మజుండు దుః
ఖారవ మాలకించి వడి నడ్డమువచ్చె జటాయు వుగ్రుఁడై. ౬౯౭

ఉ॥ ఆతని ఘోరయుద్ధమున నక్కుటిలాత్ముఁ డడంచి మించి దుః
ఖాతుర యైనసీతఁ గొని యంబుధిదాఁటి చెలంగి లంకలో
నాతరుణీమణిన్ భయద మైనయశోకవనమ్మునన్ గన
ద్ధేతులు రాక్షసాంగన ల హేతుకకోపలు చుట్టుకాఁగన్. ౬౯౮

క॥ ఉనిచిన నాజన కాత్మజ, యునుఁ బాతివ్రత్యగరిమ నొక్కింతేనిన్
ఘనతచెడకుండ రాముని, మనమున నిడి యవ్వనమున గ్రాన్పడి
యుండెన్. ౬౯౯

క॥ అంత నట రామచంద్రుం, డెంతయు మోదమున మృగము నీడిచి
కొని యొ, క్కింతవడి వచ్చుటయుం ద, త్ప్రాంతమ్మున లక్ష్మణుండు
వగ గనలుకొనన్. ౨౦౦

క॥ ఎదురైనం జూచి యిట్లను, నదయుండవై జానకీలతాంగి నొకర్తున్
వదలి యిటు రాందగునె? ద, ర్మదరక్షఃప్రచుర మీయరణ్య
మెఱుంగవే. ౨౦౧

క॥ అన నిట్లను నేమని నే, మనవి యొనర్పంగలాండ మైథిలిపలుకుల్
వినలేక వచ్చితిని మా, నినులు వివేకంబుపట్ల నేర్తురె యెందున్.
గీ॥ కాలయోగంబు దాంట శక్యంబు గాద,టంచు వృత్తాంతమును విన్న
వించె నంత, నిరువురును బర్ణశాలకు నేగి జనక,తనయం గానక
శోకించి తద్వనమున. ౨౦౩

క॥ నలుగడల వెదకి యొక్కెడ, నలుగులు దీంట్రింపం బ్రాణమవశేష
ముగా, నిలం బొరలుజటాయువుం గన,నెలుంగు బయలుపడమి
మెల్ల నిట్లను నార్తిన్. ౨౦౪

ఉ॥ నీసతిం గొంచు రావణుండు నిందితుండేగంగ నడ్డుసొచ్చి నే
నోసరిలంగం జేసిన మదోద్ధతుండై పడవైచి యేగెం ద
ద్వాసము లంకయన్పురము ప్రాణము నిల్వదు పోవుచుంటి నీ
వాసరసీరుహాక్షి కయి యత్న మొనర్పుము వేగ రాఘవా. ౨౦౫

క॥ అని మృతింగన నాతనికి ద, హనాదిక మొనర్చి తద్గహనమునం
జనుచున్, ఘనకాయునొక్కెడం గబం, ధుని శాపవిముక్తుం జేసి
తొలంగి కడంకన్. ౨౦౬

సీ॥ అతండు సెప్పిన తెఱువున నరిగి సూర్య,పుత్రితో మైత్రిం జేసి
యపూర్వ బలుని, వాలిని వధించి సుగ్రీవువంతం దీర్చి, యంతం
గిష్కింధ నాతని కాతం డొసంగె. ౨౦౭

క॥ ఆసుగ్రీవుండు కొలువంగ,హా సీతా! యనుచు సీత కడలుచు నచటన్
మాసములును వత్సరములు, చేసె నివాసంబు మైత్రింజేసి యతం
డొగిన్. ౨౦౮

క॥ నెమ్మది తన్మయమై తా, పమ్మ గడలుకొనఁగఁ గనులఁ బలుమరు
నశ్రుల్, గ్రమ్మఁగ రఘురాముఁడు తన, తమ్మున కిట్లనియె ననుగ
తమ్మగుఁ పేర్మిన్. ౨౦౯

ఉ॥ తమ్ముఁడ జానకిం గనువిధమ్ము గనంబడ దెట్లుసైఁతు! దై
వమ్ము మనమ్మకన్నఁ జలపట్టెఁ గదా! జనకాత్మజా విహీ
నమ్ముగ నేనయోధ్యకుఁ జనం బనిలేదు బహూక్తులేల ప్రా
ణమ్ములు నిల్వనోప నిఁక నాకయి సాగెకుఁ గుండఁబోకుమీ.

ఉ॥ శ్రీకర! మైనరాజ్యము హరించె నరణ్యమునందు వాస మున్
జేకురఁజేసెఁదండ్రి మహనీయునిఁ జంపె మఱింతఁ జేసియున్
బోక మదర్థగాత్రమును బోకడ పెట్టె నిఁకేమిసేయు? దు
ష్పాకము దైవ! మన్నిఁటికిఁ బాల్పడి యుంటిని మానినుక్తై వడిన్.

చ॥ పరిపరిరీతులన్ మనము పాడగు బంగరుచేతఁ బట్టఁగా
నెరువయితోఁచు దేహమున కెంతయు నార్తి తటస్థమౌ మఱె
వ్వారు తనునాదరింప రెటువంటిమహాత్మునకైన నేదియున్
సరిపడ దించు కేని గ్రహచారము చాలనినాఁడు తమ్ముఁడా. ౨౧౨

చ॥ మనుకులమందు ముందు జనమాన్యులు రాజకుమారు లెందఱో
జననమునందరో? మిగుల సౌఖ్యములొందరొ? మందభాగ్యులై
మనవలెఁ గుందిరే! మనువు నున్నసయుం జెడఁ బుట్టినార మే
మనఁదగు నిద్దఱిద్దఱము యందొక భేదములేదు తమ్ముఁడా. ౨౧౩

చ॥ వనమున భార్యఁగోలుపడి వంతలఁ జెందుచు నుంటి నేను నీ
వన గృహమందు వీడి తకటా! వికటంబుగ నెంచినాఁడ నీ
వనితఁ గనందగున్ గనఁగవచ్చునె నాసతి! నాకుసాటి యీ
మనుకులమందు కాదు మఱి మానవనాయకు లంద లేదుగా. ౨౧౪

క॥ మనువు మొదలింత దనుకన్, జనియించిన రాజులం దశక్తుండు నకిం
చనుఁ డకుముందు నాక, న్నను లేఁడికఁ బుట్టఁబోఁ డనదయు
నదయుఁడున్. ౨౧౫

ఆ॥ వె॥ ఎవరిదూఱువాఁడ! నేమనువాఁడ! ధ, నంబు బలము రెండు
నాకు లేవు, ఈవుదక్క తోడఁ కెవ్వరు లేరు పూ, ర్వకృతమును
భవింపవలయుఁ గాదె. ౨౧౬.

గీ॥ ఇంద్రపదవికిఁ దుల్యమై యెసఁగురాజ్య, మా! గతించె వసంబు సం
ప్రాప్తమయ్యె, పగవ నిందుల కొక్కింత వనజనయన, సీత లంకేశు
చేతిలోఁ జిక్కె నబల. ౨౧౭

చ॥ వలఁ బడుచక్రవాకిగతి వానికిఁ జిక్కెడివేళ నెంతఁగాఁ
గలకలమందెనో? తను నొకర్తుగ డించిననన్ను నేగతిం
దలఁచెనో? కాదుకాదు కడుఁదప్పొనరించిన నేమి చేసినన్
బలుక దొకింతయేనిఁ బతిభక్తికి లోప మొనర్ప నెంచునే. ౨౧౮

ఉ॥ లంకకు నేగి వానికిఁ దలంకి కలంకిని యౌ నటంచు నా
శంకఁ గొనంగరాదు విను స్వైరిణియే జనకాత్మజాత! యా
తంకము గల్గెనేని విహితమ్ముగఁ బ్రాణములం ద్యజించు న
వ్పంకజగంధి! యిట్లగునపక్షమునం బ్రతుకంగ నేర్తునే. ౨౧౯

క॥ అని బహువిధముల శోకిం, బున బ్రింగెడియన్నఁ జూచి సౌరి
సౌరిఁ జింతం, గననేల? రాక్షసాధముఁ,దునిమి జనకజాతఁ దెత్తుఁ
దూర్ణతరముగన్. ౨౨౦

గీ॥ ఆపదలయెడ సంపదలబ్బు నప్పు,డేకరీతిని ధీరత్వ మెవని కొదవు
నతఁడ ధీరుఁ డధీరుఁ డయ్యవసరములఁ, దన్మయుం డగు నదియ
చింతాకరంబు. ౨౨౧

గీ॥ యోగము వియోగమును దైవయుక్తిఁ జేసి, కలుగు నియ్యవి సత
ములుగావు సూవె?, ఇందులకు నింత పగవగనేల? యవియు, మన
మునకుఁ జొప్పడవు గేహమునకుఁ గాని. ౨౨౨

క॥ కాలవ్యత్యాసంబున, నే లలనయు రాజ్యభరము నిటులాయె నిఁకన్
గాలము సరియగు రాజ్యస,తీలాభము లబ్బుఁ జెడ్డదినములు వోవున్.

క॥ ప్రారబ్ధం బనివార్యం, బెరికయినఁగాని యింత యేలా! ధీరుల్
వీరులు వానరు లవనికు, మారిన్ వెదకంగఁ గడుసమర్థులు దిశలన్.

ఆ॥ వె॥ సీతయున్నచోటుఁ జెచ్చెర వానరు,లేగి చూచివత్తురేనువానిఁ
జంపి క్షణములోన జానకిఁదెచ్చెద,నింక వగలఁ బొగలనేల చెపుమ.

క॥ మనకు సహాయులు లేరని, యనుకొనకుము భరతుఁ బిలువనంపిం
చిన నే, ననుగొని చనుదేరఁడె? శ, త్రునిఁదునుమగలేమొ? యింత
దుందుడుకేలా. 226

గీ॥ రఘుమహారాజు తా నేకరథముఁ గొని స, మస్తదిశల జయించె నీ
వట్టివాని,వంశమునఁ బుట్టియును శత్రువధకు నిట్లు, తలఁక నేటికి?
నావంటి తమ్ముఁడుండ. 227

ఉ॥ ఏ నొకరుండనే జగమునెల్ల జయింతు సహాయులేల! కా
దేని విదేహభూమిపతి కించుక యీస్థితి తెల్పినన్ మహా
సేనుఁ డతండు వచ్చు నీకుఁ జేయఁగరాని దొకండు గల్గనే!
మానవనాథ! రావణునిమాటటులుంచు మెవం డెదుర్కొనున్.

గీ॥ సుఖము దుఃఖము ననునివి సుస్థిరములు, గావుగా! చక్రనేమివైఖరిని
దిరుగు, చుండు ధీరుండు దీనమగ్నుండు కాఁడు, తప్పనే యేరికై
నను దైవకృతము. 229

సీ॥ ముని దేవతలు నహుషుని నింద్రపదమున నిల్ప నింద్రుఁడు దైవని
యతికి నెద, భయమంది కుందుచుఁ బంకజాంతరమున నజ్ఞాతవా
సంబు నమరఁజేసె, బహువత్సరము;లంత నహుషుఁ డింద్రునిభార్య
యగుశచిఁ గోరి విప్రవమాన, మొనరింపఁగ నగస్త్యుఁ డుద్ధతకో
పుఁడై సర్పంబ వగుమని శాపమిచ్చె; గీ॥ నహుషుఁ డహియయ్యె
నింద్రుఁ డానంద మెసఁగఁ, దనపదంబును గైకొనె ననఘ! వ్యసన,
మబ్బుతఱి శోకమందిన నగునె! యోర్చి, కొనిన సకలసుఖమ్ములు
గొనఁగవచ్చు. 230

గీ॥ ఈవు సర్వజ్ఞుఁడవు చెప్ప నెవరితరము!, ప్రకృతునిమాడ్కి శోకింప
ఫలముగలదె!, యనెడిలక్ష్మణుపలుకుల నంత రామ, చంద్రుఁడును
సమ్మదము చెందె జనవరేణ్య. 231

గీ॥ అపుడు వారలసన్నిధి కరుగుదెంచె, నారదుఁడు కాంతినిర్జితపార దుండు, రామలక్ష్మణు లామునిరాజు గార, వించి యెంతయుఁ బూజఁ గావించి రెలమి.		232

క॥ మునియును శోకార్తుని రా, మునిఁ గని యిట్లనియె నీదుముదితర్ నీతర్, దనచే తెలియఁగక రావణుఁడనయుండై యపహరించె నని వింటి జవిర్.		233

క॥ శోకింపనేల! విను మో, కాకుత్థ్సకులావతంస! కలసంగతి నీ వాకుటిలాత్ముని జంపుట, కేకద! యవతారమంది తినవంశమునర్.

క॥ ఆకతమున జనకాత్మజ,నాకుటిలాత్ముఁడు హరించె నహినెఱుఁగక కా దే!కంఠమునం దిడికొనె, నీకావలుఁ డింక మన్ను టిట్లు ఘటించుర్.

సీ॥ పూర్వజన్మమ్మున భూతనూజాత మునీశ్వరకన్యక యీమె తపము నాచరించుచునుండ నతిదుష్టుఁ డగురావణాసురుఁ డొక్కనాఁ డడవి కేగు, దెంచియక్కన్నియఁ గాంచి మోహించి తనకు భార్యఁగాఁ గోరిన వినక తను, నెదురింపఁ గచభరం బెనసిపట్టిన నాతలోదరి "యోమత్త! యోదురాత్మ!; గీ॥ యనఘ నగునన్ను ముట్టినయట్టి నీదు,చావునకు భూస్థలి నయోనిజాత నగుచుఁ, బుట్టెద" నటంచు శపియించి పొలిసి యిపుడు,మైథిలియనంగఁ బుట్టెఁ దన్మరణమునకు.

క॥ ఈవును హరియంశమ్మున, దేవప్రేరణముచే నిదే పని గా ని ట్లావిర్భవ మందితివిగ,దా! వగపేల! వధియింపు మాదుష్టాత్మున్.

ఉ॥ జానకి రావణాసురువశమ్మును బొందక యిందుఁ డంపునా ధేనువుపాలునర్ సుధయు దేహము నిల్పఁగ నీదునామమే ధ్యానముఁ జేయుచుర్ బ్రతిపదమ్ము నినుం గొని యాడుచుర్ దగర్ బ్రాణముతోడ నున్నది నృపాలక! నేఁ గనుఁగొంటి నింతయుర్.

ఉ॥ వాని జయింప నీకొకయుపాయముఁ దెల్పెద నంబికర్ జగ త్ప్రాణనదక్షుమైననవరాత్రివిధానమునర్ బలిర్ విధా నానుగతంబు గాఁ దగినయట్టిపశువ్రజముం బొనర్చి య ద్దాన దశాంశ మగ్నికిడి తన్పుము హోమవిధానసత్క్రియర్. 235

క॥ ఈగతి నొనరించిన శర, దాగమమునఁ; గార్యసిద్ధి యలవడుదీనిక్
భోగీశశయనుఁ డింద్రుఁడు, నాగమవిహితముగఁ జేసి యందిరి సిద్ధుల్
గీ॥ తనదుభార్యను జందుఁ డొందు గొనఁగ గురుఁడు, నీవ్రతమొనర్చి తాఁ
గృతకృత్యుఁ డయ్యెఁ, గశ్యపవసిష్ఠభృగుమునిగాధిసుతులు, చేసి రి
ద్దాని నిది కార్యసిద్ధిదంబు. ౨౮౧
గీ॥ వృత్రుని జయింప నిందుఁ డొందు త్రిపురవిజయ, మునకు శంకరుఁడును
దా మధుని హరింప,హరియు నొనరించి రీవ్రతం బఘహరంబు,జయ
కరము సౌఖ్యకరము యశస్కరంబు. ౨౮౨
క॥ అనఘ! యిది సుఖితులును జే,యనగుఁజుమీ! వ్రతము;మఱియు నతి
దుఃఖితు లొ,నరులిద్దాని నొనర్చిన,జననికి దయగలుగుఁ జెలఁగు సౌఖ్య
ములెల్లన్. ౨౮౩
క॥ అనవిని శ్రీరాముం ,,డో, మునివర! యావ్రతవిధానముం దద్దేవీ
ఘనచరితంబుఁ బ్రభావం, బును నాకుం దెల్పు మనుడు ముని
యిట్లనియెన్. ౨౮౪
గీ॥ శక్తియన నిట్టిదని చెప్ప శక్యమగునె?,హరిహరబ్రహ్మలందు రక్షావ
సాన, సృష్టిరూపమ్ముల మెలంగు జీవరాసు, లందుఁ దత్కళ యనుగత
మై చెలంగు. ౨౮౫
గీ॥ బ్రహ్మమొదలు పిపీలికారాశి దనుకఁ, దత్స్వరూపం బితరమొకింత
యును లేదు; ఆమె విహరించుఁ గల్పాదియందుఁ బరమ, పురుషు
తోఁ గూడి నిర్గుణస్ఫూర్తి మెఱయ. ౨౮౬
గీ॥ మీఁద సగుణాత్మయగుచుఁ బేర్మి మెయి నఖిల, భువనములుసృష్టిఁ
జేసి త్రిమూర్తులను ని, మిత్తమాత్రమ్ముగా వీనిమీఁద నుంచు,
నామె నెఱిఁగిన బంధమ్ము లడఁగిపోవు. ౨౮౭
గీ॥ ఆపెనామములన నకారాదియును క్ష, కారమంతంబు గల వర్గ
ణము నర్థ,యుక్తముగ గుణకర్మాదియుక్తి గూర్చ,వెలయు నెన్నని
యన రాముఁ డెలమి దనర. ౨౮౮
క॥ దేవీపూజాకృతి శ్ర, ద్ధావంతుఁడనగుచుఁ జేయఁ దలఁచెద నాకున్
గేవలము తద్విధానం, బీవానతి యిమ్మనన్ మునీంద్రుం డనియెన్.

చ॥ సమమగు దేశమందు విలసద్గతిఁ బీఠము వెట్టి వేదయు
క్తముగఁ బరాంబిక న్నిలిపి తన్నవరాత్రిములం దుపోషణ
క్రిమమునసుండి యీవ్రతవరంబుఁ గరంబు నొనర్పు మే గురు
త్వ మొనరుతుర్ జగత్త్రియహితం బగుకార్యముగాన నావుడున్.

క॥ 'రాముం డాశ్వయుజమ్మున, నాముని చేయింపఁ దన్మహావ్రితమును ద
ద్భూమీధరమునఁ దమ్ముని,తో మోద మొలర్పఁ జేసెఁ దొమ్మిది
దినముల్. ౭౫౧

ఆ॥వె॥ అష్టమీదినమ్మునందు నిశీథమ్ము,నందు సింహవాహ యగుచుజనని
దర్శనంబొసంగి దయఁజిల్కుచూపుతో,నిట్టు లనియె రాఘవేశ్వరునకు

క॥ రామా! జగదభిరామా!, నామది సంతోషపెట్టినాఁడవు నీకుం
గామము లొసంగవచ్చితి, నీమానినితోడఁ బొత్తు నీకబ్బు నికన్.

సీ॥ మత్స్యమై మున్ను సోమకుఁ ద్రుంచి వేదముల్ బ్రహ్మ కిచ్చినజగ
త్ప్రభుఁడ వీవ,కూర్మంబ వై యబ్ధిఁ గ్రుంకిమందర మెత్తి రహి నెసంగిన
మహామహుఁడవీవ,కోలమై యిలఁదాల్చి కుత్సితుం డగుహిరణ్యాక్షుఁ
జంపినదానవారి వీవ,నరహరివై హిరణ్యకశిపుఁజంపి ప్రహ్లాదు నేలిన
కృపావంతి వీవ; గీ॥ కపటవామనరూపంబు గాంచి బలిని, ద్రోచి
యింద్రునకిచ్చిన దొరవునీవ, పరశురాముఁడవై భూమిపాలకులను
రూపుమాపినయట్టి ముకోపి వీవ. ౭౫౨

క॥ నీయవతారములన్నియు,నాయంశముతోడఁ గూడినయవియ మఱి నీ
కాయూయివానరులునుస,హాయులగుదు రందఱును మదంశోపేతుల్

క॥ ఇపు డాచరించినట్టులె, సపర్య రాఁబోవు నీవసంతర్తువునం
దపరిమితశ్రద్ధాభ, క్తిపరీతుఁడ వగుచు సలిపి దీప్తిం గనుమా.

క॥ రావణుఁ బరిమార్పఁగ నమ,రావళులకు మేలుఁగూర్ప ననఘుదశరథ
క్ష్మావిభుఁ గృతార్థుఁజేయఁగ, నావిర్భవమందితిప్పు డర్కకులమునన్.

ఉ॥ ఈతఁడు లక్ష్మణుం డలఘణీంద్రునియంశము రావణాత్మజున్
బాతితుఁ జేయు దేవముని బాధకు రావణుఁ జంపి మీఁద సా
కేతపురమ్ముఁజేరి చిరకీర్తి ననేక సహస్రవర్షముల్
భూతల మేలి పైఁ ద్రిదివముల్ గనఁగాఁ గల వంచు నేగినన్. ౭౫౩

క॥ శ్రీరామమూర్తియును విజ, యారాధనచేసి దశమియందు వితరణ
శ్రీ రంజిల్లఁగ భూసుర,వారము దనియించి లంకపై కరిగె వెసన్.
ఉ॥ వారధిగట్టి రావణునిఁబట్టి వధించి తదీయరాజ్యముం
గూరిమి నవ్విభీషణునకున్ దగనిచ్చి ధరాత్మజాత సు
శ్రీరహిమీఱఁ గైకొని సుశీలురు వానరు లాశ్రయింపఁగా
ధీరుఁడు రామచంద్రుఁ డరుదెంచె నయోధ్యకు సుప్రమోదుఁడై.
క॥ దేవీచరితము వినిన శు,భావహమగు యశముగలుఁగు నైశ్వర్యాయు
ర్భావమ్ము లెనయు నిట్టిది,భూవలయమ్మునను లేదు భూపవతంసా.
వ॥ అని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లక్కథకుండు
శౌనకాదులకుం జెప్పుటయు, ౨౬౨

స్కంధాంతపద్యములు

క॥ రాజాధిరాజనతపద!, రాజారామాఖ్యవిబుధరాజచ్ఛాత్రా?
తేజోభిభూతమిత్రా, భూజనహిత! సకలలోకపూజ్యచరిత్రా. ౨౬౩
చ॥ సతతమహాన్నదానవిలసత్పరిపూర్ణకళాప్రదానవ
ర్ధితనిరవద్యకీర్తివిశదీకృతవాగ్రమణీమణీకర
స్థితసితనీరజాతరససేవనలోలుపమత్తబంభర
ద్యుతి! మతిమద్గతీ! బుధవిధుస్తుత! బుద్ధిబృహస్పతీ! కృతీ. ౨౬౪
మాలినీవృత్తము॥ సుకవివినుతశిష్యా! సూరివంద్యప్రశిష్యా!
సకలమతవిహారీ! సాధులోకప్రచారీ!
అకపటమతిలీలా! వ్యాప్తసాద్గుణ్యహేలా!
ప్రకటవిబుధశంసా! బ్రహ్మవిద్వద్వతంసా. ౨౬౫

గద్య.

ఇది...శ్రీ తిరుపతివేంకటేశ్వరప్రణీతంబయిన
దేవీభాగవతం బనుమహాపురాణము
నందుఁ దృతీయస్కంధము.
శ్రీ. శ్రీ. శ్రీ.
శ్రీమత్పరదేవతార్పణమస్తు.

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 12 | తిను | తిన్ను |
| 2 | 15 | నియు౦ | నియునం |
| 6 | 18 | నెదు | నెది |
| 6 | 27 | నొన్నె | నొన్నె |
| 7 | 8 | దంయే | దంబయే |
| 7 | 22 | రంచె | గంశె |
| 32 | 8 | యంబ! | య బ |
| 33 | 23 | పునేంత | పుంజేంత |
| 41 | 20 | డావె | డావే |
| 44 | 7 | గాదివి | గాదిలి |
| 45 | 26 | తంయు | తెండు |
| 50 | 8 | గాన | కాన |
| 50 | 20 | సు వాం | సువాం |
| 52 | 22 | నింబొడసూ | నతనింజా |
| 53 | 9 | వలి | వకలి |
| 53 | 25 | సింధుండ | సంధి య |
| 64 | 12 | దంబ! | దంబ |
| 51 | 1 | వింపన్ధిగం | వంబందగ్ర |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 51 | 2 | చుసు | కుగ్రన |
| 51 | 2 | సుస్తోక | మున్ఘోర |
| 68 | 3 | తే॥ | గ॥ |
| 71 | 25 | తిని | తిని |
| 71 | 22 | మొగ | మోగు |
| 74 | 9 | తల్లి | తల్లి |
| 74 | 12 | జంత | జింత |
| 74 | 14 | సుంగు | సుంగు |
| 74 | 22 | సంత | నంత |
| 74 | 23 | నేకా | నేకా |
| 75 | 11 | కుంగ్రి | కుంబ్ర |
| 78 | 14 | దెంజో | దేంజో |
| 87 | 13 | మహా | మాహా |
| 79 | 6 | తనము | తము |
| 89 | 19 | జగు | బగు |
| 90 | 20 | విరు | విఱు |
| 102 | 3 | వార | వారి |